THE LARGEST CIRCULATED TELUGU EDUCATIONAL MONTHLY

# ఐక్య ఉపాధ్యాయ

జూన్ 2004 ఆంధ్రప్రదేశ్ ఐక్యఉపాధ్యాయ ఫెడరేషన్ అధికార పత్రిక వెల : రూ.5/-







**విద్యా విషయక ప్రత్యేక సంచిక**







## నూతన ప్రభుత్వం - నూతన విద్యా సంవత్సరం

CI



నాగూర్ యం.యల్.ఎ.గా ఎన్నికైన యు.టి.యఫ్. రాష్ట్ర కౌన్సిలర్
కె.లక్ష్మణమూర్తితో యు.టి.యఫ్. రాష్ట్ర నాయకత్వం



వి.యల్.నరసింహారావుగారి ద్వితీయ వర్ధంతి సభ వేదిక-ఖమ్మం




యన్.జె.లివింగ్స్టన్, ప్రమోదకుమారిల కుమార్తె మణికుమారి వివాహం - తూ॥గో॥



పి.రమేష్‌బాబు, వెంకట సుజాతల
వివాహం, ప్రకాశం



ఎ.చంద్రారెడ్డి పదవీ విరమణ-చిత్తూరు



యం.చంద్రశేఖరరెడ్డి పదవీ విరమణ - చిత్తూరు

# ఐక్య ఉపాధ్యాయ


విద్యా విషయక మాసపత్రిక

జూన్, 2004

సంపుటి : 30 సంచిక : 6




ఈ సంచికలో .....




సంవత్సర చందా : రూ. 60-00

విడిప్రతి : రూ. 5-00



ఐక్య ఉపాధ్యాయ

గగన్ మహల్ రోడ్ నెం. 7, దోమల్‌గూడ,
హైదరాబాద్-29.

ఫోన్ : 27636840 ; ఫ్యాక్స్ : 27636840

UTF ఆఫీస్, ఫోన్: 27677242, ఫ్యాక్స్: 27650366

E-mail UTF : aputf 2000@yahoo.com

*Ramireddy* : dachuri_ramireddy@yahoo.co.in

Cell No.: 9848511212


## సంపాదకీయం

# విద్యారంగంలో విప్లవాత్మక మార్పులు రావాలి

కొన్ని రంగాలలో విశేష కృషి చేసి అద్భుతమైన మార్పులు సాధించి వాటికి పారిశ్రామిక విప్లవం, హరిత విప్లవం, క్షీర విప్లవం, ఐ.టి.విప్లవం అని పేరుపెట్టారు. అలాగే విద్యారంగంలో కూడ విప్లవం రావాలి.

మనకు స్వాతంత్ర్యం వచ్చి దాదాపు 5 దశాబ్దాలు దాటినా విద్యారంగంలో విప్లవం రాలేదు. మనదేశానికి ఎటువంటి విద్యా విధానం కావాలో యింత వరకు నిర్ధారణ జరుగలేదు. ప్రభుత్వాలు మారినపుడల్లా, నాయకులు మారినపుడల్లా ఏదో ఒక పేరుతో పైపై మార్పులు చేయడం తప్ప నిర్దిష్ట పథకం రూపుదాల్చలేదు.

బ్రిటిషు కాలంలో ప్రవేశపెట్టిన మెకాలే విద్యా విధానమే నేటికీ అమలవుతున్నది. గాంధీగారు చెప్పిన బేసిక్ విద్యా విధానం ఆశయం మంచిదయినా ఆధునిక ఆవిష్కరణలైన సాంకేతిక మార్పులతో పోటీపడలేని, పోటీపడలేక నశించిపోతున్న చేతి వృత్తులకు జోడించినందున విఫలమయింది. ఆ తర్వాత కొఠారి సిఫారసుల ప్రకారం కొంత మార్పు వచ్చినా నిధుల కొరతతో దానిని అటకెక్కించారు. ఈశ్వరభాయి కమిటీ సిఫారసుల పేరుతో యస్.యు.పి.డబ్ల్యు ప్రవేశ పెట్టినా, ఆచరణలో అది అమలుకాలేదు. రాజీవ్ గాంధీ నవోదయ పాఠశాలలు పెట్టినా అవి కొద్ది మందికే ఉపయోగపడుతున్నాయి తప్ప అందరికీ మెరుగయిన విద్యను వాటి ద్వారా అందించే అవకాశంలేదు.

ఇప్పటికీ నిరక్షరాస్యత నిర్మూలన కాలేదు. ఉన్నత విద్యా రంగం పూర్తిగా, ప్రైవేటు మయం కావడమే గాక వ్యాపారీకరణ కూడా చేయబడింది. వాటిలో విద్యార్థులను పరిపూర్ణ మానవులుగా తయారు చేయకుండా మార్కుల రేసు గుర్రాలుగా తయారు చేస్తున్నారు. దేశ భక్తికి, సామాజిక దృక్పథానికి బదులు స్వార్థమే పరమార్థమయింది. వీటిలో చదివిన వారు స్వదేశాన్ని గూర్చిన స్పృహలేకుండా డబ్బుకొరకు విదేశీ సేవలకే అర్రులు చాస్తున్నారు.

ఈ నేపథ్యంలో విద్యారంగంలో విప్లవాత్మక సంస్కరణల ఆవశ్యకత ఏర్పడింది. దేశ భవిష్యత్తుకు ప్రాథమిక విద్య పునాది అని గుర్తించి అవసరమైన నిధులకొరత లేకుండా చూడాలి. 14 సంవత్సరాల ఉచిత నిర్బంధ ప్రాథమిక విద్య అమలయ్యేలా చూడాలి. ఆర్థిక బాధలుండే పిల్లలకు హాస్టల్ సౌకర్యం కల్పించాలి. అన్ని రాజకీయ పార్టీలు, సామాజిక వర్గాలు దీనికి ఏకోన్ముఖంగా కృషి చెయ్యాలి. 'అందరికీ విద్య' ఆచరణలో విజయవంతం కావాలంటే కేరళమార్గమే శరణ్యం.

ప్రాథమిక విద్యలో మాతృ భాషకు గట్టి పునాది ఏర్పడాలి. విద్యార్థులలో లౌకిక భావాలు నాటుకొనే విధంగా, వారు శ్రమ విలువను గుర్తించే విధంగా సిలబసు, బోధన ఉండాలి. సెకండరీ విద్య పూర్తయ్యేనాటికి పై చదువులు చదువలేని వారందరూ ఏదో ఒక వృత్తిని చేపట్టేవిధంగా నైపుణ్యం కలిగించాలి.

పాఠశాలల నిర్వహణలో కూడా మార్పులు రావాలి. ఖాళీలు లేకుండా ఉపాధ్యాయ పోస్టులతో పాటు అడ్మినిస్ట్రేటివ్ పోస్టులు అన్నింటినీ భర్తీ చెయ్యాలి. ప్రాథమిక పాఠశాలలకు ప్రధానోపాధ్యాయుల పోస్టులు, నాల్గవ తరగతి పోస్టులు మంజూరు చెయ్యాలి. యల్.యఫ్.యల్. పోస్టులన్నిటిని ప్రధాన గ్రామాల ప్రాథమిక పాఠశాలలకు బదలాయించాలి. సర్వీసు రూల్సు సరళంగా నిర్దిష్టంగా ఉండాలి. అన్ని మేనేజ్‌మెంట్ల ఉపాధ్యాయులకు ఒకే విధమైన రిక్రూట్‌మెంట్, సర్వీసు నిబంధనలు ఉండాలి.

నాణ్యమైన విద్య కావాలంటే ఉపాధ్యాయ, విద్యార్థి నిష్పత్తి హేతుబద్ధంగా ఉండాలి. పాఠ్యాంశాలలో స్థానిక చరిత్ర, భూగోళం సంస్కృతి ప్రతిబింబించాలి. ప్రతి పాఠశాలలో అన్ని సబ్జెక్టులతో పాటు లలిత కళలను బోధించే ఉపాధ్యాయులు కూడా వుండాలి.

మనది ప్రధానంగా వ్యవసాయ దేశం. దీని కనుగుణంగా సాంకేతిక నిపుణులను తయారు చేసే కోర్సులు విస్తారంగా ఉన్నత విద్యలో రావాలి. పేద వారికి ధనికులకు సమానంగా విద్యావకాశాలుండాలి. బాలకార్మిక వ్యవస్థను నిర్మూలించాలి, ప్రభుత్వ పాఠశాలలు ఏవిధంగానూ ప్రైవేటు పాఠశాలలకు తీసిపోరాదు. బోధన పట్ల ఆసక్తి కలవారినే ఉపాధ్యాయ శిక్షణకు ఎంపిక చేయాలి. శిక్షణ పొందిన వారందరికి వెంటనే ఉద్యోగావకాశాలు కల్పించాలి. ఆవిధంగా ఉపాధ్యాయ శిక్షణాలయాల సంఖ్యను నియంత్రించాలి. ప్రతి పాఠశాలకు అనుబంధంగా పరిశ్రమ గాని, వ్యవసాయ క్షేత్రం గాని ఉండాలి. ఆట స్థలాలు, తోట స్థలాలు ఉండాలి. శానిటరీ వసతులు కల్పించాలి.

పల్లెలలో ప్రతి పాఠశాలకు అనుబంధంగా ఉపాధ్యాయులకు నివాస గృహాలు నిర్మించాలి. ఉపాధ్యాయులు పనిచేసేచోటనే నివసించే వాతావరణం కల్పించాలి. బదిలీలకు నిర్దిష్ట గడువు ఉండాలి. శాస్త్రీయమైన బదిలీల కోడ్‌ను రూపొందించాలి. ఉపాధ్యాయులను నాన్ వెకేషన్ డిపార్టుమెంటుగా ప్రకటించాలి. పిల్లలకు సెలవులిచ్చినా ఉపాధ్యాయులకు వేసవిలో ప్రత్యేక శిక్షణ యివ్వడం, వివిధ ప్రాంతాలలో పర్యటనలు, రాబోయే విద్యా సంవత్సర ప్రణాళికల రచనకు సిద్ధపడేలాచేయడం వంటి కార్యక్రమాలు ఉండాలి.

ఇదంతా జరుగాలంటే విద్యారంగంలో పై పై మెరుగులు గాక ఒక విప్లవమే రావాలి. అప్పుడే ఈ దేశం సర్వతోముఖంగా అభివృద్ధి చెందుతుంది.

*

# వార్తాప్రపంచం

## కేరళ ప్రజలనేత నయనార్ మృతి

కేరళ ప్రజల ప్రీతిమ నాయకుడు ఇ.కె. నయనార్ 86వ ఏట 19.5.2004 కన్నుమూశారు. వీరి మరణంతో కేరళ ప్రజలు అత్యంత గౌరవప్రదుడు, త్యాగశీలి, సాహితీ వేత్త, ఆదర్శ మూర్తి, పరిపాలనా దక్షుడిని కోల్పోయారు. ఆయిన 3 సార్లు ముఖ్యమంత్రి బాధ్యతలు నిర్వహించి అత్యంత క్లిష్టమైన సంకీర్ణ మంత్రి వర్గాలను జయప్రదంగా నడిపారు. సుదీర్ఘకాలం ముఖ్యమంత్రిగా పని చేసి రికార్డు నెలకొల్పారు. ఆయన కమ్యూనిష్టు (మార్క్సిస్టు) పార్టీలో జిల్లా, రాష్ట్ర కమిటీల కార్యదర్శిగాను, జాతీయ స్థాయిలో పోలిట్ బ్యూరో సభ్యుడుగాను పనిచేశారు. దేశాభిమాని దిన పత్రిక ప్రధాన సంపాదకుడుగాపనిచేశారు. ఆయన పల్లె ప్రజలు మాట్లాడే మళయాళీ భాషలో హాస్యోక్తులతో జనరంజకంగా ఉపన్యసించేవారు.



ఆయన ముఖ్యమంత్రిగా ఉన్నా ఆయన భార్య శారద టీచరుగానే పనిచేసింది. ఆమె తిరువనంతపురం వచ్చి ఊరేగింపులో అందరితో పాటు పాల్గొని ముఖ్యమంత్రిని కలువడం అందరిని ఆశ్చర్యపరిచింది. వారు పాతతరం నాయకులు, త్యాగశీలి. వారి మరణానికి యుటియఫ్ సంతాపం తెలుపుతుంది.



## జస్టిస్ ఎస్. రాజేంద్ర బాబు పదవీ ప్రమాణం

భారత ప్రధానన్యాయమూర్తిగా జస్టిస్ ఎస్. రాజేంద్ర బాబు మే 2వ తేదీన పదవీ ప్రమాణం చేశారు.

## వై.ఎస్. రాజశేఖర రెడ్డి



రాష్ట్ర ముఖ్యమంత్రిగా డా॥ వై.ఎస్. రాజశేఖర రెడ్డి ప్రమాణస్వీకారం చేశారు. వెనువెంటనే ఆయన తన ఎన్నికల హామిని నెరవేరుస్తూ1192 కోట్ల వ్యవసాయ విద్యుత్తు బకాయిల రద్దు, సేద్యానికి ఉచిత విద్యుత్ సరఫరాకు చెందిన ఫైల్సు పై సంతకాలు చేశారు.

## ఇరాక్ కొత్త అధ్యక్షుడు

ఇరాక్ కొత్త అధ్యక్షుడిగా, అమెరికాకు నమ్మకస్తుడు, సున్నీ మత పెద్ద, గిరిజన నేత ఘాజీముషాల్ అజిల్ అల్-యావర్‌ను తాత్కాలిక పాలకమండలి ఎంపిక చేసింది.



## బాగారెడ్డి మరణం

కాంగ్రెస్ కురువృద్ధుడు యం. బాగారెడ్డి జూన్ 3న, కన్ను మూశారు. ఆయన మెదక్ స్థానం నుంచి ఏడుసార్లు లోక్‌సభకు ఎన్నికయ్యారు. రాష్ట్ర క్యాబినెట్‌లో భారీ పరిశ్రమలు, రవాణా, పంచాయితీరాజ్ శాఖలను నిర్వహించారు.

## స్పీకరుగా సురేష్ రెడ్డి



12వ శాసనసభ స్పీకర్‌గా నిజామాబాద్ జిల్లా బాల్కొండ ఎం.ఎల్.ఎ. కె.ఆర్. సురేష్ రెడ్డి ఎక గ్రీవంగా ఎన్నికయ్యారు.

## తప్పలు సవరించుకుంటున్న జయలలిత

తాను మహారాణినని, తనకు ఎదురు లేదని విర్రవీగుతున్న జయలలిత తమిళనాడులో నిరంకుశ పాలన చేస్తున్నది. మత మార్పిడి నిరోధక చట్టం చేసింది. ఏనుగులకు విశ్రాంతి విడిది ఏర్పాటు చేసింది. రైతులకు ఉచిత విద్యుత్తును ఉపసంహరించింది. మధ్యాహ్నభోజనంలో కోడి గుడ్డును మానివేసింది. ఉద్యోగులకున్న అనేక సౌకర్యాలను రద్దు చేసింది. 2 లక్షల మందిని తాత్కాలికంగా డిస్మిస్ చేసింది. కోర్టు తీర్పు తర్వాత 999 మందిని శాశ్వతంగా ఉద్యోగాల నుండి తొలగించింది. 6 వేలమందికి వేతనాలలో కోత విధించింది.

పార్లమెంటు ఎన్నికలలో ఒక్కసీటు కూడ రాకపోవడంతో తలమత్తు వదిలింది. చేసిన పాపాలన్నీకడుక్కుంటున్నది. రద్దుచేసిన సౌకర్యాలన్నింటిని పునరుద్ధరించింది. ఉద్యమ రోజులలో చనిపోయినవారు రిటైరయినట్లు పరిగణించి వారి కుటుంబాలకు నష్టపరిహారం యిచ్చింది. ప్రజా స్వామ్యంలో నిరంకుశులకు ఈ గతి సర్వసామాన్యమే.

☆



లయోలా
జూనియర్ కళాశాల
టీచర్స్ కాలనీ, మహబూబ్ నగర్.
ఫోన్: 242830(0), 252588 (0), 245519 (R)
Bi.P.C.లో
Dist. 1st Double Ranks &
Dist. 2nd Rank
S. SANTOSH 952
S. LAXMA REDDY 952
V. SWETHA 949
M.P.C. TOPPERS
M. SWATHI 948
K. KEERTI PRIYA 934
M. PAVAN KUMAR 934
R. RAJAVARDHAN REDDY 934
N.C.C.
N.S.S.
Studies తో పాటు N.C.C., N.S.S. వంటి ఉన్నతమైన Organisation గల ఏకైక కళాశాల.
Games & Sportsలలో కూడా విద్యార్థులను ప్రోత్సహించడం జరుగును
ఒక సంవత్సరం లేదా రెండు సంవత్సరాలు కాదు గత 8 సంవత్సరాలుగా కళాశాల స్థాపించిన నాటినుండి (1996) నేటి వరకు అత్యధిక మార్కులు, అత్యధిక ఉత్తీర్ణత శాతం, BITS - PILANI Seats, EAMCET Seats, Prathibha Awards సాధించుచూ... గత 8 సంవత్సరాలుగా Highest Marks-90% తగ్గకుండా Unique Results పొందుచూ మహబూబ్‌నగర్ జిల్లాలో "Stable and Standard Institution" గా పేరు ప్రఖ్యాతి తెచ్చిపెడుతున్న మా కళాశాల విద్యార్థులు అభినందనీయులు. వారిని తమ అమూల్యమైన బోధనతో తీర్చి దిద్దుతున్న మా అధ్యాపక బృందమునకు ధన్యవాదములు.
I.P.E.YEAR - WISE HIGHEST MARKS
94.5% MD. Rafi 1996-98
93.8% T. Nagaraju 1997-99
91.2% B. Jayesh 1998-2000
94% Raghavendar Goud 1999-2001
96.1% Uday Kumar Reddy 2000-2002
96.1% G. Chaitanya 2001-2003
95.2% S. Santosh 95.2% S. Laxma Reddy 2002 - 2004
COURSES : INTER + EAMCET, AIEEE, M.P.C., Bi.P.C., M.E.C. (Both Media)
BUS FACILITY FROM JADCHERLA
గమనిక : 500 పైగా మార్కులు పొంది Merit కల్గిన విద్యార్థులకు ఫీజులో రాయితీ ఇవ్వబడును.

# పాఠకుల అభిప్రాయాలు

ఈనాడు ఆంధ్ర రాష్ట్రంలో 'తెలుగు' అనాదరణకు గురి అవుతున్నది. మాతృభాషమీద అభిమానం పోయి పరాయి భాషపై మోజు పెరిగిపోతున్నది. ఇదే పరిస్థితి కొనసాగితే అమృత తుల్యమైన తెలుగు భాష అంతరించే ప్రమాదం పొంచి ఉన్నది. తెలుగు భాష అంతరించిపోకుండా కాపాడే గురుతర బాధ్యత యుటియఫ్ పై కూడా ఉన్నదని నేను భావిస్తున్నాను. కావున మన పత్రిక యందు 'తెలుగు' గొప్పతనాన్ని, మాధుర్యాన్ని తెలియజేసే వ్యాసాలు ప్రచురితం కావాలి. అంతేకాకుండా గొప్ప రచయితలు వ్రాసిన ఎన్నో గ్రంథాలలో ఒకదాన్ని ఎంపికచేసి ధారావాహికగా పత్రికలో ప్రచురిస్తే బాగుంటుందని భావిస్తున్నాను.

*కె. పవన్ కుమార్, దర్శి, ప్రకాశం జిల్లా*

నేను 'ఐక్య ఉపాధ్యాయ పత్రికను నాకు ఉద్యోగం వచ్చిన నెల నుంచి (1996 నవంబర్) నుంచి రెగ్యులర్‌గా చదువుచున్నాను. ప్రతినెల పత్రిక చదవక పోతే నాకు ఏదో లోటు అన్పిస్తుంది. పత్రికను ప్రతినెల 2వ తేదీలోపు వచ్చేటట్లు చేస్తే చాలా బాగుంటుంది. మహనీయుల పేజీ అని కేటాయించి దానిలో ప్రతినెల ఒకరి గురించి ప్రచురిస్తే బావుంటుంది. మే నెల పత్రిక ముఖ చిత్రం సందర్భానుసారంగా ఉంది. "విద్యారంగంలో నూతన ప్రభుత్వం ఎన్నికల ప్రణాళికలో చేసిన వాగ్ధానాలు అమలు జరపాలి". అనే నారాయణగారి వ్యాసం చాలా బాగుంది. ఎన్నికైన నూతన ప్రభుత్వానికి సూచనగా ఉంది. 'సుందరయ్యగారి వ్యక్తిత్వం' ఈనాటి యువతరానికి ఎంతో మార్గదర్శకంగా ఉంది. ఆయన జీవితం అందరికీ ఆదర్శం. కవితలు కూడా చాలా బాగున్నవి. అడ్వర్‌టైజ్‌మెంట్స్ ప్రచారం తగ్గిస్తే మంచిది. పేపరు క్వాలిటీ కొంచెం పెంచితే బాగుంటుంది. జనరల్ నాలెడ్జ్ శీర్షిక పునరుద్ధరించండి.

*చాముకూరి పుల్లయ్య, నేలకొండపల్లి(ము॥), ఖమ్మం.*

మేడే ఉత్సవాల సంరంభం ముఖ చిత్రంతో 'మే' నెల ఐక్య ఉపాధ్యాయ 'మాసపత్రిక' అందుకొని కార్మికుల ఆనందాలను, వారు అందిస్తున్న శుభాకాంక్షలను అందుకొని ఎంతో ఆనందించాం.

చక్కటి అంశాన్ని ముఖ చిత్రంగా ప్రచురించిన ఐక్య ఉపాధ్యాయ మాసపత్రిక యాజమాన్యానికి, సిబ్బందికి, ఛీఫ్ ఎడిటర్ గారికి మా అభినందనలు.

మహోన్నత వ్యక్తి - కీ॥శే॥ శ్రీ పుచ్చలపల్లి సుందరయ్య గారి 19వ వర్ధంతి సందర్భముగా ఆయన చిత్రపటాన్ని మాముందుంచి వారి జీవిత చరిత్రను వివరిస్తూ ఈ తరం వారు శ్రీ పుచ్చలపల్లి వారి జీవితాన్ని అధ్యయనం చేస్తూ, వారిని ఆదర్శంగా తీసుకొని తమ జీవితాన్ని రూపొందించుకోవాలని ఆకాంక్షించడం సముచితంగా ఉంది. వ్యాసం ద్వారా, ఈ అసాధారణ వ్యక్తి గురించి ఎన్నో విషయాలు తెలుసుకొన్నాం. డా॥ యార్లగడ్డ లక్ష్మీ ప్రసాద్ గారికి మా అభినందనలు. డా॥ దాశరథి రంగాచార్య గారు రచించిన "అయోధ్య రావణం" శీర్షిక ఎంతో సమాచారాన్ని అందజేసింది. వారికి మా కృతజ్ఞతలు.

*ఆర్. రఘుభీర్ సింగ్, ఏలూరు*

మేడే ఉత్సవాలతో మే 2004 ఐక్య ఉపాధ్యాయ పత్రిక అందినది. మహోన్నత వ్యక్తి శ్రీ పుచ్చలపల్లి సుందరయ్య జీవిత విశేషాలు, ఆయన క్రమశిక్షణ, వ్యాయామ శిక్షణ, పట్టుదల నిరాడంబర జీవితమే యువతకు స్ఫూర్తి ప్రదాయకం. గాలిమార్పు సంపాదకీయం క్రొత్త ప్రభుత్వానికి స్వాగతం. నిరంతర పోరాటాలే మనకు శరణ్యం అవడం "అక్షరసత్యం". ఎయిడెడ్ సిబ్బందికీ ప్రతి నెల ఒకటవ తేదీ జీతం అందని మాని పండు. కొత్త ప్రభుత్వము హయాములోనైనా ఎయిడెడ్ వారికి బడ్జెట్ కంట్రోలు తీసివేసి ప్రతినెల ఒకటవ తేదీన జీతము అందే విధంగా చర్యలు తీసుకుంటుందని ఆశిస్తున్నాము.

*ఎం.బి. అవధానులు, మలికి పురం, తూ॥గో॥*

ప్రపంచ వ్యాప్తంగా జరిగిన 'మే' డే ఉత్సవాలను మే ఐక్య ఉపాధ్యాయ పత్రిక కవర్‌పేజి పై ప్రచురించినందుకు విప్లవాభినందనలు. సమ్మె హక్కుపై మన సుప్రీం కోర్టు తీర్పు యిచ్చిన అనంతరం జరిగిన మే డే అయినందున భారత కార్మిక వర్గం నిర్వహించిన మేడే ఉత్సవాలను ప్రచురించి ఉంటే స్ఫూర్తి దాయకంగా యుండేది. మహనీయుడు, సిద్ధాంతాన్ని, ఆచరణలో చూపిన ఆదర్శమూర్తి సుందరయ్యగారి ఫోటో వ్యాసము ప్రచురించడం సరి అయింది. భావితరానికి స్ఫూర్తి అందించే విధంగా ప్రతి నెల వీరి జీవిత చరిత్ర ప్రచురిస్తే బాగుంటుంది. సంపాదకీయం లోక్ సభ, శాసనసభల ఎన్నికల ఫలితాల ప్రకటన ముందు వ్రాసినా ఎన్నికల ఫలితాలకు అద్దం పట్టింది. సమాజసేవ చేయవలసిన ఎం.ఎల్.ఎ. పదవి ఏ విధంగా వ్యాపారీకరణ అయినదో "ఎం.ఎల్.ఎ. సీట్ ఎంతో స్వీట్"పాలో వివరించారు. రాజధానిలో రాయబారాలు - సంఘం - పని వివరణలో పారదర్శకత కనబడింది.

*ఎస్.డి. జియావుద్దీన్, వి.ఆర్. పురం, ఖమ్మం*

# సిటిజన్ ఛార్టరా? సంత బేరమా?

- 3. సత్తిరాజు, తూ॥గో॥ జిల్లా

ఒంటి పూట బడి అనంతరం సూర్య తాపానికి గురై యింటికి చేరుకొన్న గిరీశం వాలు కుర్చీలో భారంగా కూలపడ్డాడు. భార్య భాగ్యలక్ష్మి మంచినీరు అందిస్తూ అమ్మాయి పెండ్లి ఏర్పాట్ల గురించి గుర్తు చేసింది. అమ్మాయి అత్తింటి వారి లాంఛనాలు పూర్తి చేయడానికి జమాఖర్చులు తేల్చగా యింకా కొంత డబ్బు సమకూర్చవలసి వచ్చింది.

వ్యక్తిగత ఆర్థిక భారాలు ఎన్ని వున్నా ఇన్‌కంటాక్స్ భూతం నుండి తప్పించుకోవటం కోసం, వడ్డీరేటు తగ్గినా ప్రావిడెంట్ ఫండ్ నెలసరి చందా భారీ మొత్తంలో గిరీశం జీతం నుండి తగ్గించటం వలన నిల్వ మొత్తం నుండి పార్ట్ ఫైనల్ తీసుకోవాలని నిర్ణయించుకొని జిల్లా పరిషత్తు కార్యాలయనికి ప్రయాణమైనాడు. గేటు దాటగానే ఎదురుగా ఉన్న సిటిజన్ ఛార్టర్' బోర్డు చూసి త్వరగా లోను సొమ్ము అందుకొనగలనని ఆశపడ్డాడు. వెంటనే లోనికి ప్రవేశించి తనదరఖాస్తును సిటిజన్ ఛార్టర్‌లో నమోదు చేసి రశీదు యివ్వాలని గుమాస్తా గజలక్ష్మిని కోరాడు. కాని ఆమె గిరీశాన్ని నిరాశకు గురి చేస్తూ "సిటిజన్ ఛార్టర్‌లో యిస్తే ఏదో ఒక కారణంతో దరఖాస్తును తిప్పి పంపుతారు. మీరు పైన సెక్షన్‌లో మీ తాలూకు గుమాస్తా రాముని కలిసి మాట్లాడుకోండి" అని ఉచిత సలహా యిచ్చింది.

గిరీశం నిరాశగా వెనుదిరిగి పి.ఎఫ్. సెక్షన్‌లో చకోర పక్షిలా చూస్తున్న సెక్షన్ సూపరిండెంటు సీటు వద్దకు చేరుకున్నాడు. ఆయన దరాఖాస్తుపై సంతకం చేసి గుమాస్తా సీటు వద్దకు పంపించాడు.

గుమాస్తా రాము దరఖాస్తును గుచ్చిగుచ్చి చూచి "మీరు కోరుకున్న సొమ్ము కావాలంటే ఈ డాక్టర్ సర్టిఫికెట్ సరిపోదు. మీ దరఖాస్తులో లోపాలున్నాయి. జాగ్రత్తగా చూచుకొండి" అని యిబ్బంది పెట్టాడు.

గిరీశం తన కర్తవ్యం గుర్తుకు తెచ్చుకొని రాము వైపు తీక్షణంగా చూస్తూ "ఏమిటి లోపాలు?" అని ప్రశ్నించాడు. "అదేమి లేదండీ. మీరు సహకరిస్తే త్వరగా లోను మంజూరు అవుతుంది. ఆలోచించుకోండి". అన్నాడు గుమస్తా.

గిరీశం పరిస్థితిని గమనించి డబ్బుల కొరకు యిబ్బంది పెడుతున్నట్లు గుర్తించాడు. ఇంతలో అటుగా వచ్చిన అటెండర్ "మాష్టారు! ఒకసారి యిటురండి"అని ప్రక్కకు పిలిచి రేటు విషయం చెప్పాడు.

వెంటనే గిరీశం ఆవేశంగా కేకలు వేసి జిల్లా పరిషత్ సియిఓకి ఫిర్యాదు చేయడానికి వెళ్ళాడు. తలుపులు మూసి వున్నాయి. వెంటనే జడ్.పి.లో జరుగుతున్న అవినీతి భాగోతాన్ని బట్టబయలు చేయాలని సంఘం కార్యాలయానికి పరుగెత్తాడు. విషయాన్ని వివరించి సంఘం ద్వారా లోను మంజూరు చేయించుకున్నాడు

*

రాష్ట్రంలోని ఉపాధ్యాయ, విద్యారంగ సమస్యల పరిష్కారంలో

# ఆంధ్రప్రదేశ్
# ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్

మరింత కీలక పాత్ర పోషించాలని ఆకాంక్షిస్తూ
నూతన విద్యా సంవత్సర అభినందనలతో

| వై. కృష్ణ<br>అధ్యక్షులు | జి. సత్యనారాయణ రావు<br>ప్రధానకార్యదర్శి |
|---|---|

## ఆంధ్రప్రదేశ ప్రధానోపాధ్యాయుల సంఘం
రంగారెడ్డి జిల్లా

# ఆంధ్రప్రదేశ్ విద్యారంగం
## 2002-2003

### ప్రభుత్వ గుర్తింపు పొందిన

| | |
|---|---|
| ప్రాథమిక పాఠశాలలు | 63,362 |
| ప్రాథమికోన్నత పాఠశాలలు | 15,110 |
| ఉన్నత పాఠశాలలు | 12,570 |
| హయ్యర్ సెకండరీ పాఠశాలలు | 79 |
| మొత్తం | 91,121 |

### ట్రైనింగు పాఠశాలలు

| | | |
|---|---|---|
| డైట్స్ జి.టి.టి.ఐ.లు | | 25 |
| బి.ఇడి కాలేజీలు | | 106 |
| వ్యాయమ విద్యా కాలేజీలు | | 05 |
| పండిట్స్ ట్రైనింగు | హిందీ | 30 |
| | తెలుగు | 18 |
| | ఉర్దూ | 01 |
| | మొత్తం | 185 |

### ప్రత్యేక తరగతి పాఠశాలలు

| | |
|---|---|
| బధిర పాఠశాలలు | 42 |
| మానసిక వికలాంగులు | 135 |
| గ్రుడ్డి వారు | 31 |
| అంగవికలురు | 11 |
| సంస్కరణ పాఠశాలలు | 12 |
| ఓరియంటల్ పాఠశాలలు | 177 |
| మొత్తం | 408 |

### బడిలో చదివే పిల్లలు

| | బాలురు | బాలికలు | మొత్తం |
|---|---|---|---|
| ప్రాథమిక పాఠశాలలు | 31,97,135 | 31,53,937 | 63,51,072 |
| అప్పర్ ప్రైమరీ పాఠశాలలు | 17,61,580 | 16,27,609 | 33,89,189 |
| మొత్తం | 49,58,715 | 47,81,546 | 97,40,261 |

### సెకండరీ విద్య

| | | | |
|---|---|---|---|
| ఉన్నత పాఠశాలలు | 22,33,949 | 18,44,409 | 40,78,358 |
| హయ్యరుసెకండరీ పాఠశాలలు | 41,297 | 37,039 | 78,336 |
| మొత్తం | 22,75,246 | 18,81,448 | 41,56,694 |

### ఉపాధ్యాయ శిక్షణ

| | | | |
|---|---|---|---|
| డైట్స్ | 1682 | 1261 | 2943 |
| బి.ఇడి | 6924 | 5523 | 12447 |
| వ్యాయమ విద్య | 510 | 147 | 657 |
| పండిట్స్ ట్రైనింగు | | | |
| హిందీ | 604 | 988 | 1592 |
| తెలుగు | 590 | 384 | 974 |
| ఉర్దూ | 17 | 33 | 50 |

### ప్రత్యేక పాఠశాలలు

| | | | |
|---|---|---|---|
| బధిరులు | 3076 | 1589 | 4665 |
| మానసిక వికలాంగులు | 2547 | 1563 | 4110 |
| గ్రుడ్డివారు | 1048 | 542 | 1590 |
| అంగవికలురు | 495 | 340 | 835 |
| సంస్కరణ పాఠశాలలు | 779 | 57 | 836 |
| ఓరియంటల్ పాఠశాలలు | 21447 | 22634 | 44081 |

### ఉపాధ్యాయుల వివరాలు

| | పురుషులు | స్త్రీలు | మొత్తం |
|---|---|---|---|
| ప్రాథమిక పాఠశాలలు | 98240 | 75491 | 1,73731 |
| అప్పర్ ప్రైమరీ పాఠశాలలు | 59629 | 42523 | 102152 |
| మొత్తం | 157869 | 118014 | 275883 |
| ఉన్నత పాఠశాలలు | 81946 | 58073 | 140019 |
| హయ్యరు సెకండరీ పాఠశాలలు | 1402 | 2226 | 3628 |
| మొత్తం | 83348 | 60299 | 143647 |

### ఉపాధ్యాయ శిక్షణా సంస్థలు

| | | | | |
|---|---|---|---|---|
| డైట్స్ | | 330 | 72 | 402 |
| బి.ఇడి కళాశాలలు | | 818 | 360 | 1178 |
| వ్యాయమ విద్య | | 40 | 3 | 43 |
| పండిట్స్ | హిందీ | 149 | 51 | 200 |
| | తెలుగు | 115 | 30 | 145 |
| | ఉర్దూ | 12 | 11 | 23 |
| | మొత్తం | 1464 | 527 | 1991 |

### విద్యావాలంటీర్లు

| | | | |
|---|---|---|---|
| ప్రాథమిక పాఠశాలలు | 11144 | 7044 | 18188 |
| అప్పర్ ప్రైమరీ పాఠశాలలు | 9570 | 6035 | 15605 |
| ఉన్నత పాఠశాలలు | 7733 | 3865 | 11598 |
| మొత్తం | 28447 | 16944 | 45391 |

| మేనేజ్‌మెంట్ల పాఠశాలలు | | | | | |
|---|---|---|---|---|---|
| మేనేజ్‌మెంటు | ప్రాథమిక పాఠశాలలు | అప్పర్ ప్రైమరీ | ఉన్నత పాఠశాలలు | హయ్యర్ సెకండరీ | మొత్తం |
| కేంద్ర ప్రభుత్వం | 40 | 10 | 43 | 51 | 144 |
| రాష్ట్ర ప్రభుత్వం | 5626 | 468 | 1189 | - | 7283 |
| మండల జి.ప | 49845 | 10024 | 6599 | - | 66468 |
| మున్సిపల్ | 1423 | 296 | 264 | - | 1983 |
| ప్రైవేటు ఎయిడెడ్ | 2265 | 518 | 864 | - | 3647 |
| ప్రైవేటు అన్‌ఎయిడెడ్ | 4163 | 3794 | 3611 | 28 | 11596 |
| మొత్తం | 63362 | 15110 | 12570 | 79 | 91121 |
| **ఉపాధ్యాయులు** | | | | | |
| కేంద్ర ప్రభుత్వం | 265 | 60 | 1054 | 1995 | 3374 |
| రాష్ట్ర ప్రభుత్వం | 10579 | 3353 | 15762 | - | 29694 |
| మండల, జి.ప. | 1,11,193 | 53985 | 57340 | - | 222518 |
| మున్సిపల్ | 4710 | 2073 | 3593 | - | 10376 |
| ప్రైవేటు ఎయిడెడ్ | 8915 | 4212 | 11476 | - | 24603 |
| అన్ ఎయిడెడ్ | 38069 | 38469 | 50794 | 1633 | 1,28,965 |
| మొత్తం | 173731 | 102152 | 140019 | 3628 | 4,19,530 |

చదవండి! చదివించండి!!

జట్రోఫా, బయో డీజిల్ చెట్ల సాగును ఉద్యమంగా చేపట్టండి.

మొదటి పేజీ నుండి చివరి వరకు ఆసక్తిదాయకం, విజ్ఞానదాయకం ముఖ్యంగా ఆర్థికంగా లాభదాయకం

అన్నదాతల కొరకు గాదె వీరారెడ్డి శ్రమించి, పరిశోధించి రాసిన

దేశం, రైతుల పాలిట కల్పతరువు, భాగ్యరేఖ

# జట్రోఫా, బయో డీజిల్ చెట్లు

(చరిత్ర, శిక్షణ, సాగు, మార్కెటింగ్ తదితర వివరాలతో సహా)

అనేక సమస్యలతో రైతాంగం కుమిలిపోతున్నది. దిక్కుతోచని పరిస్థితిలో మన అన్నదాత ఉన్నాడు. వరుసగా కొన్ని సంవత్సరాలు వర్షాలు పడక, కరవు కాటకాలతో, కొన్ని సంవత్సరాలు తుపానులతో మన రైతులు ఇబ్బందులు పడుతున్నారు. ఏదైనా ఒక సంవత్సరం ప్రకృతి కరుణిస్తే, రైతులు ఆరుగాలం కష్టించి పండించిన పంటలను వ్యాపారస్తులు, మధ్య దళారులు, కొంతమంది అధికారులు కుమ్మక్కై పంటల ధరలను అథఃపాతాళ లోకానికి తొక్కి రైతుల కష్టాన్ని దోచుకుంటున్నారు. ఇందుకు తోడు వ్యవసాయం పట్ల గత కాలపు కేంద్ర, రాష్ట్రాల ప్రభుత్వాల అసమర్థ, అసమంజస విధానాలు, బ్యూరో క్రసీ కఠినత్వం, అవినీతి రైతులను కుంగతీశాయి. ఇతరులకు అన్నాన్ని పెట్టే రైతును ఆత్మహత్య చేసుకునే విధంగా దెబ్బతీశాయి.

మరోవైపు ఏటా సుమారు లక్ష కోట్ల రూపాయల విదేశీ మారక ద్రవ్యాన్ని వెచ్చించి క్రూడ్ ఆయిల్‌ను మన దేశంలో కొనుగోలు చేస్తున్నది. అంతర్జాతీయంగా పెరిగే క్రూడ్ ఆయిల్ ధరలు మన దేశ ఆర్థిక వ్యవస్థ మీద గణనీయంగా ప్రభావం చూపే ప్రమాదం అతి సమీపంలో ఉన్నది. క్రూడ్ ఆయిల్ వాడకం వలన పర్యావరణం కూడా దెబ్బతింటున్నది.

ఈ అన్ని సమస్యలను సమర్థవంతంగా పరిష్కరించే శక్తి, అవకాశం ఇప్పుడు భారతీయ రైతుకు వచ్చాయి. బయో డీజిల్ చెట్ల పెంపకం వలన రైతులు ఆర్థికంగా అభివృద్ధి చెందడమే కాకుండా, దేశాభివృద్ధికి కూడా దోహదం చేసిన వారవుతారు. 'జై జవాన్, జై కిసాన్' నినాదాన్ని నిజంగా సార్థకంగా చేసిన వారవుతారు.

జట్రోఫా, బయోడీజిల్ చెట్ల సాగు చాలా తేలిక. పెట్టుబడి తక్కువ, ఆదాయం ఎక్కువ. జట్రోఫా, బయోడీజిల్ చెట్లకు చీడ పీడల బాధ లేదు. పశువులు, పక్షులు ముట్టవు. వీటి సాగు మొదలు పెట్టిన సంవత్సరంలో తప్ప, ఆ తర్వాత చెప్పుకోదగ్గ ఖర్చులు ఉండవు. 40-50 సంవత్సరాల వరకు ఈ చెట్లు కాపు ఇస్తూనే ఉంటాయి.

అన్ని తరగతుల రైతులకు అనుకూలమైన పంట, రైతులకు మాత్రమే కాదు, భూమి ఉన్న ఉద్యోగస్తులకు, వ్యాపారస్తులకు, పారిశ్రామిక వేత్తలకు కూడా చాలా అనుకూలమైన పంట.

పై సమస్యలను కూలంకషంగా చర్చించడంతో పాటు, పరిష్కార మార్గంగా జట్రోఫా, బయో డీజిల్ చెట్ల సాగును ఉద్యమంలా చేపట్టవలసిందిగా జట్రోఫా - బయో డీజిల్ చెట్ల రైతుల సంక్షేమ సంఘం అధ్యక్షులు, సుజాత లా బుక్స్ ప్రైవేట్ లిమిటెడ్ డైరెక్టర్ శ్రీ గాదె వీరా రెడ్డి రైతులకు పిలుపునిస్తున్నారు. బయో డీజిల్ చెట్ల సాగును చేపట్టుట కొరకు రైతులకు ప్రేరణ, ప్రోత్సహమివ్వవలసిందిగా ఉపాధ్యాయులను కోరుతున్నారు.

క్రూడ్ ఆయిల్, జట్రోఫా, బయో డీజిల్ చెట్ల చరిత్ర, వాటి సాగుకు కావలసిన సాంకేతిక విషయాలు, మార్కెటింగ్, ఋణాలు, సబ్సిడీలు మొదలైన అనేక వివరాలను తేట తెలుగులో సాధారణ రైతుకు అర్థమయ్యే విధంగా రచయిత వివరించారు.

పుస్తకం ఖరీదు **రు. 200.**

పుస్తకం ఖరీదును పూర్తి మొత్తంలో మనీయార్డర్ లేదా డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా పంపిన వారికి పోస్టేజీ ఉచితం. రిజిస్టర్డ్ పోస్ట్‌లో పుస్తకాన్ని పంపిస్తాము. కొద్ది మొత్తాన్ని అడ్వాన్సుగా పంపిన వారికి వి.పి.పి. ద్వారా పంపిస్తాము. మీ పేరు, చిరునామా స్పష్టంగా రాయండి.

మా చిరునామా...

సుజాత అగ్రికల్చరల్ బుక్స్ అండ్ రీసెర్చ్ ప్రైవేట్ లిమిటెడ్,
4-5-212, 4-5-217, సుజాత లా బుక్స్ ప్రైవేట్ లిమిటెడ్,
గాంధీ జ్ఞాన్ మందిర్ (యోగా) పక్కన, యోగా వీధి, వుమెన్స్ కాలేజ్ రోడ్,
కోఠి, హైదరాబాద్ - 500 095. ఫోన్స్ : 040-24753947, 55763900, 31015825.

# భారతదేశ విద్యారంగ తిరోగమనం

-శ్రీ కాంతి బిశ్వాస్
విద్యాశాఖామాత్యులు-పశ్చిమ బెంగాల్

To-day is 25th May. This day is marked by many a remarkable incident in the past. World famous writer Oscar Wilde was sentenced on this day in 1895 to 2 years hard labour in Britain for being a sodomite. In 1909, Britain passed the Indian councils Act, giving more power to local legislative councils in India on this day. In 1963, the Organisation of African Unity (OAU) was established on this day at Addis Ababa, Ethiopia, by heads of 32 African states. On 25th May, 1977, Government of China lifted its ban imposed during cultural revolution on the works of William Shakespeare, which had been denounced as bourgeois.

At the auspices of School Teachers' Federataion of Inida, you the teachers working in primary, secondary and higher secondary schools in different parts of Inida assembled here to deliberate the different aspects of education, the problems you are confronted with in your profession and your commitment to the society. According to the report of random sampling of 7 metropolitan cities viz. Delhi, Bombay, Chennai, Bangalore, Kolkata, Hyderabad and Ahmadabad, conducted by a Research Agency under the direction of Mr. A.C. Nielson to assess who is useful to the society, teachers have been given the highest credit to the tune of 15.9 and credit of 14.2 has been assigned to doctors, 12 8 to defence personnel, 11.8 to farmers, 11.7 to judges and so on. In Indian tradition, teacher is put on the highest pedestal along with one's parents and even higher that the gods one worships. Ancient Rishis sang-

Teaching community can play its expected role in a society provided two conditions are satisfied - one: the congenial environment in the society and two: the performance of teahcers in their profession. After a long protracted freedom struggle and at the sacrifice of huge number of patriotic people, we achieved independence 57 years before. We have enormous natural resources in our contry and have glorious past of our own. We have 108 crores population which constitutes 16.8% of the total population of the world. But Indian educational scenario in the context of the present day world is extremely melancholy. Some data of several World Reports will demonstrate our pitiable condition in this respect.

Adult (+ 15 years of age) Literacy Rate

| | | Person | Female |
|---|---|---|---|
| World | : | 79.7% | 74.2% |
| India | : | 57.2% | 45.4% |

(Education for All 2003-04 Report - Page 308,311)

Total illiterate people of the world is 86 crores, India's share is 29 crores which constitutes 33.7% of the global illiterate population.

youth (15-24 years of age) Literacy Rate

| | | |
|---|---|---|
| Medium Income countries | : | 87.8% |
| India | : | 73.3% |

(Human Development Report-2003-Page 272-3)

**Secondary Enrolment Ratio**

| | Male | Female |
|---|---|---|
| World | 66% | 61% |
| Developing countries | 60% | 53% |
| Inidia | 59% | 39% |

**Percentage of Primary students reaching Grade-5**

| | |
|---|---|
| World | 77% |
| Developing countries | 77% |
| Inidia | 60% |

(State of the World Children-2004, Page97-99)

**Private enrolment to total enrolment**

| | Primary | Secondary |
|---|---|---|
| World | 7.3% | 10.6% |
| Developing countries | 10.7% | 15.7% |
| Inidia | 16.5% | 42.4% |

(EFA Report - Page 380-2)

Out of School Children (Primary)

| | | |
|---|---|---|
| Worl | : | 11 crores |
| Inida | : | 4 crores |

In the educational Index of 94 developing countries, India stands at 76th position, only 18 countries laging behind to that of Inida.

Average Annual Household Expenditure Per Student in

**Elementary Schools Primary**

| | Rural | | Urban | |
|---|---|---|---|---|
| | Male | Female | Male | Female |
| Government | 219 | 219 | 509 | 470 |
| Local Body | 223 | 223 | 714 | 621 |
| Private aided | 693 | 529 | 1652 | 1525 |
| Private unaided | 902 | 925 | 1975 | 1866 |
| Total | 305 | 286 | 1197 | 1092 |

**Upper Primary**

| | Rural | | Urban | |
|---|---|---|---|---|
| | Male | Female | Male | Female |
| Government | 548 | 555 | 923 | 864 |
| Local Body | 533 | 553 | 1148 | 995 |
| Private aided | 893 | 868 | 1884 | 1734 |
| Private unaided | 1240 | 1267 | 2933 | 2908 |
| Total | 640 | 641 | 1590 | 1456 |

(Working Group Report on 10th 5-year Plan - P. 50-51)

**Percentage of public expenditure on education to total public expenditure.**

| | |
|---|---|
| Worl | 14.2% |
| Developing Countries | 14.1% |
| Inida | 12.2% |

(EFA Report - Page 380-1)

**Percentage of Central Govt. expenditure on education to its total expenditure**

| | |
|---|---|
| World | 6% |
| Developing countris | 11% |
| India | 2.2% |

(The State of the World Children 2004-Page 105-6)

**Defence Expenditure (as a % of Central Government Expenditure**

| | |
|---|---|
| India | 14.0 |
| Pakistan | 23.0 |
| Bangladesh | 11 2 |

**Percentage of budgeted expenditure (Revenue Account) on Education to Total Budget**

| | |
|---|---|
| Centre & State | 13.17% |
| West Bengal | 24.52% |

(Selected Educational Statistics-P.8)

**Allocation for Education in 5-year plans in India.**

| | |
|---|---|
| 1st 5-year Plan | 7 2% to total plan outlay |
| 10th 5-year Plan | 2 9% to total plan outlay |

**Percentage of Public Expenditure on Eudation by level**

| | Pre-Primary & Primary | Secondary | Tertiary |
|---|---|---|---|
| Inida | 39.4 | 40.5 | 20 |
| Pakistan | 51.8 | 27.9 | 13 |
| Bangladesh | 46.7 | 43.0 | 10 |
| Nepal | 60 0 | 24 6 | 12 |

(Human Development in South Asia Report-2003-P.180)

**Child Population in India (2001)**

| | |
|---|---|
| Below 6 years of age | 158 Million |
| 6-11 years of age | 118.3 Million |
| 11-14 years of age | 74 5 Million |
| 14-18 years of age | 91.7 Million |
| 18-24 years of ageq | 114.4 Million |

25 Million children are born every year in Inida.

**Enrolment**

| | | | |
|---|---|---|---|
| Class I-V | : 113 9 Million | :% of Girls | : 44% |
| Class VI-VII | : 44.8 Million | : | : 41.8% |
| Class IX-X | : 20 1 Million | : | : |
| Class XI-XII | 10.1 Million | : | : 39.5% |

In tertiary level:

| | | | |
|---|---|---|---|
| In Colleges | : 76.55 lakhs | | |
| In Universities | : 11.6 lakhs | | |
| Total | : 88.21 lakhs | : | : 38% |

Combined Primary, secondary and tertiary gross enrolment ratio:-

| | |
|---|---|
| World | : 64% |
| Developing | : 60% |
| India | : 56% |

(Human Dev.Report - 2003, Page 239-40)

Less than 44% of children of relevant age group are enrolled in secondary education.

According to estimate made by world Bank, working secondary education completers earns 2.9 times higher than illiterate workers and primary education completers earns 1.7 times higher than illiterate workers.

There is no denying the fact that independence there is remarkable expansion of scope of education as shown below, but it is far behind the expected target.

| | 1950 | 2001 |
|---|---|---|
| Primary School | 2,09,671 | 6.64.041 |
| Upper Primary Schools | 13,596 | 2,19,626 |
| High/Higher Secondary Schools | 7,416 | 1,33,492 |
| Colleges for general education | 370 | 8,737 |
| Universities | 27 | 272 |
| Professional Colleges | 208 | 2.409 |
| **Teachers** | | |
| Primary | 5,38,000 | 19,28,000 |
| Upper Primary | 86,000 | 14,68,000 |
| High/Higher Secondary | 1,27,000 | 17,77,000 |
| Total | 7,51,000 | 51,73,000 |

(Selected Educational Statistics-2001-02)

Total number of school teachers in the world is over 5 crores. India's share is 10% to it.

**Percentage of female - teachers in Inida**

| | |
|---|---|
| Primary Schools | 37% |
| Upper Primary Schools | 37.3% |
| High/Higher Secondary Schools | 34.9% |

Though it has been universally accepted that the performance of female teachers in average, better than male teacher. India is one of the few countries where the percentage of female teacher in schools is lowest.

It has been revealed from World survey that low **Pupil: tehacher** ratio reduces drop-outs of students and upgrade standard of education, but pupil teacher ration in Inida is worse than that of the average of developing countries and of the world. Decesion of many state Governments has stopped filling up resultant vacancies of teaching posts in schools. Karnataka and many other states have kept 50% of total teaching posts vacant for financial crisis. In Tamil Nadu 1,93,000 posts of teachers in secondary schools have been reduced to 83,000 and 500 primary schools have been closed down. Unprecedented attack last year on the rights and honour of teachers by the State Government in Tamilanadu is a slur on the history of education in India. Tripura and West Bengal are exception where no vacant teaching post are kept unfilled by the decision of the Government. Transfer of teachers creat a serious problem in many states.

Infrastructural facilities in school, according to Sixth Education Survey, are quite inadequate and the latest position will be made known to us within few months when report of Seventh Education Survey will be published.

There is a common critism that almost all the budgetary provision for educaiton is exhausted to pay the salary of teacher and very little amount is left for developing infrastructural facilities in schools. Worst example is Indonesia where 99% of education budget is used for payment of salary of teachers. In India, education is a subject in concurrent list of the Constitution, where Central Govt. has great role to play. Report of the working group on secondary education of X-5 year plan states-"The Centre may also share with states the responsibility of giving direction to the expansion and qualitative improvement of secondary and Higher Secondary education. "In Budget of the Central Government for 2003-04, only Rs. 26 crores was provided for quality improvement of secondary and higher education and Rs. 1,134 crores were allocated for kendriya Vidyalayas and Novodaya Vidyalayas and the total budget on secondary education is Rs. 1,408 crores which is less than half of the provision for the same in West Bengal. Share of Central Government of the total expenditure on secondary and higher secondary education in Inida is only 6.98% for plan and 5.97 for non-plan. The central Government had been seriously trying to communalise the entire gamut of education - and to curtailed the scope of education. Retirement benefit of teachers particulary pension is under threat. Supreme Court pronounced judgement against payment of gratuity to teachers. Of course, Govt. of West Bengal declared its policy to contine the payment of gratuity to retired teachers disregarding the judgement of the Supreme Court.

The emergence of GATS (General Agreement on Trade in Services) by replacing GATT in 1995 has thrown a new challenge to the education system of developing countries. It comprises 12 specified services including educational services. The danger of GATS has been correctly apprehended as it will lead to the commodification of education and degrading human face like education, culture, health and social welfare. It will lead to 2 system of education; one is maintained largely on the basis of households capacity - to pay and the other patronised by those segments which can not meet the costs of quality education-as reported by a report" challenges of Internationalisation of School Education" published by NIEPA 42 countries so far signed the GATS, and India is one of them. 31 schools in Rajasthan have already been afiliated with Cambridge University.

A report presented in the Global Development Network Conference workshop held in New Delhi on 25-26 January, 2004 identified some problems. According to its survey, absence of teachers in India in average is 25%, in Jharkhand it is 39.3%, in Bihar, it is 38.3% and this absence rate is very high in comparison with other countries. Head teachers and powerful teachers are the highest offender.

A high percentage of teachers was found during survey neglecting class-room performance in schools.

Inspection and monitoring in schools is urgently required to be strengthened in order to set the house in order.

By 86th Amendment of the Constitution and a proposed Act already published by the Central Government, free and compulsory education for the children from 6 to 14 years of age has been reiterated, but the entire financial burden has been place with the State Governments and local dodies. Teaching community is expected to raise its voice against it. At the same time Model University Bill has been published by the Central Government and the autonomy of the University and the role of State Government, teachers and students for the Governance of the University has been seriously undermined. It should be resisted by a popular movement.

Report of International Commission for Education for the twenty-first century popularly konwn as Delors-Commission has

correctly states "teachers have crucial roles to paly in preparing yound people not only to face the future with confidence but to build it with purpose and responsibility *** *** *** when pupils spend less time in school than in front of a televvision set, the efforltless and instant gratification offered by the media contrast starkly, in their mainds, with what is required to succeed at shcool". "The teacher's work is not confined simply to transmitting information or even knowledge, it also entails presenting that knowledge in the form of statement of problems within a certain context and putting the problems into perspective, so that the learner can link their solution to broader issues".

In has been admitted in the Report that "Teacher's working conditions have in many cases deteriorated greatly owing to the shortage of financial resources and suitable teaching materials, and to over-crowded class-room". Here in India teaching community can avail themeselves of many opportunities in this regard under Sarva Shiksha Abhijan Project.

The Commission has laid great confidence and importance on teacher's organisations which, according to it, can and do play powerful roles in a variety of fields.

School Teachers' Federation of India has come into existence as a federating body only few years back and its total memebership is not very large in comparison wih the total strength of teachers of our country, but by dint of its commitment and organising skill it has created its position. New Government at the centre has been established through 14th Lok Sabha election and so called National Democratic Alliance - rule along with its Minister for Human Resources Development have been routed. The role of the teaching community in this regard is to be appreciated. Let us hope numerous black misdeed in different secotrs of education will be washed out. Teachers should come forward to take advantage of it and play its due role to streamline the pace of education in appropriate perspective.

I hope this convention and exchange of experience of you will strengthen the organisation and help you immensely discharge your noble duties for the welbeing of the students, prosperity of the nation and for the welfare of humnity.

*

కొత్తతరం పాఠశాల

# సంఘ జీవన పురోగమనానికి దోహదపడే విజ్ఞానాన్ని నేర్చుకుంటున్న చిన్నారులు

ఆ ధార్‌మాణిక్ గ్రామంలో ఉత్తమ్ బసు అనే వ్యక్తికున్న ప్రాధాన్యం అంతా ఇంతా కాదు. ఇరుగూ పొరుగూ రకరకాల విషయాలకు సంబంధించి అతని సలహా కోసం పరుగులు తీస్తుంటారు. బాతుల్ని మరింత సురక్షితంగా పెంచుకోవడమెలా? తోటల్లో కూరగాయల ఉత్పత్తిని పెంచుకోవడమెలా? – ఇలా ఉంటాయి వారి ప్రశ్నలు. కొందరైతే జ్వరం, అతిసార వ్యాధి బారి నుంచి తమను కాపాడమంటూ అతని వద్దకు వస్తుంటారు. సాధారణంగా ఒక టీనేజ్ కుర్రాడికి ఇంత ప్రాముఖ్యం ఎక్కడా లభించదు. అయితే, 17 ఏళ్ళ బసు వ్యవసాయం, పశువులు, మనుషుల ఆరోగ్యానికి, సంబంధించిన చిట్కాలన్నీ అరచేతిలోంచి తీస్తున్నట్లు చక చకా చెప్పేస్తాడు.

బసు జీవితంలోని ఈ మార్పునకు బీజం అయిదేళ్ళ కిందట పడింది. పశ్చిమ బెంగాల్‌లోని ఉత్తర ప్రాంత 24 పరగణాల జిల్లాలకు చెందిన బదూరియా బ్లాక్ పరిధిలోని గ్రామాలకు చెందిన తన స్నేహితులతో కలసి బసు బడికి వెడుతుండేవాడు. అతను, అతని మిత్రులు ఓ రోజున "తమ భవిష్యత్తయిన వ్యవసాయం గురించి పాఠ్య పుస్తకాలేమీ చెప్పడం లేదని" గుర్తించారు. "పటంలో కె-2 పర్వతాన్ని గుర్తించడమన్నది మాకు అరకదున్నడానికి ఏ విధంగా సహాయపడుతుంది" అని ప్రశ్నించే బసు, "నాకు అన్నింటి కన్నా నా భూమి, నా చుట్టూ ఉన్న పర్యావరణం గురించి తెలుసుకోవడం అవసరం" అన్న నిర్ధారణకు వచ్చాడు. అప్పుడతనికి ఒక స్థానిక స్వచ్ఛంద సంస్థ చేయూత లభించింది. ఆ సంస్థ సహకారంతో ఆ యువ మిత్రులు కిశోర్ బాహిని (కె.కె.బి.) పేరుతో యువజన సంస్థ ప్రారంభించారు. ఆ సంస్థ లక్ష్యం తరగతి గది వెలుపల తరగతులు నిర్వహించడం.

ఈ స్వయం సహాయక బృందం తమ వద్దకు శిక్షణకు వచ్చే వారందరికీ (అందరూ 18 ఏళ్ళ లోపు వారే) మొదట రకరకాల పనులను నేర్పిస్తుంది. వెనుకబడిన బదూరియా ప్రాంతంలో అక్షరాస్యత, ఆరోగ్య సంరక్షణ అనేవి అందని మానిపళ్ళు, అయితే ప్రాంతంలోని 8 గ్రామాలకు చెందిన 250 మంది పిల్లలతో ఏర్పడిన ఈ యువజన బృందం అక్కడ కొత్త ఉత్సాహాన్ని పరవళ్ళు తొక్కిస్తోంది. ఈ యువకులు 44 రకాల పనులను శరవేగంగా పూర్తి చేస్తుంటారు. కె.కె.బి.లోని అందరికన్నా చిన్న వయస్కులు (కొంత మంది కేవలం ఎనిమిదేళ్ళవారే) వారి వయసుకు తగిన పనులు చక్కబెడుతుంటారు. ప్రాథమిక చికిత్స, మొక్కల పెంపకం, పక్షులు, కీటకాల గురించి అధ్యయనం చేసి, అవి పంటలకు ఎలా ఉపయోగపడతాయో తెలుసుకోవడం వంటి సులభమైన పనులు చిన్న వారు చక్కబెడుతుంటారు. అంతేకాక, ఎప్పటికప్పుడు అందే సమాచారాన్ని గ్రాఫులుగా, పట్టికలుగా చిత్రించడంలోనూ వారికి శిక్షణ లభిస్తుంటుంది. పదమూడు, పధ్నాలు గేళ్ళు వచ్చేప్పటికి వారికి వాతావరణ పరిసరాలను అధ్యయనం చేయడం, వర్షపాతం నమోదు చేయడం, బోరు బావులను పరిశుభ్రం చేయడం, కలుపును ఏరి వేయడం,గ్రామంలోని రోడ్లను బాగుచేయడం వంటి విద్యల్లో ప్రావీణ్యం వచ్చేస్తుంది.

అయితే, ఆ యువతరం సంకల్పం అంత సులభంగా ఏమీ సాధ్యం కాలేదు. పెద్దల మీద పై చేయి సాధించాలన్నది పిల్లలాట కాదు కదా. 1997లో ఈ చిన్నారులు తమ కృషిని ప్రారంభించినప్పుడు గ్రామస్థులంతా వారిని కొత్త సమస్యలు సృష్టించేవారిగానే భావించారు. తమ ఆశయమేమిటో ఊరిలోని పెద్దలకు అర్థమయ్యేలా చెప్పడానికి వారికి ఏడాది పట్టింది. "అనుమానంగా చూస్తున్న పెద్దలను ఆరుబయళ్ళను మరుగుదొడ్ల నిర్మాణానికి వదిలేయాలని ఆ పిల్లలు ఒప్పించగలిగారు. ఇక వారికి తిరుగులేదని అప్పుడే అనుకున్నాను" అని కె.కె.బి. పారిశుధ్య కార్యక్రమ సలహాదారు సమీర్ బిశ్వాస్ అన్నారు. ఆరోగ్య పరిరక్షణ, పరిశుభ్రత విషయాలలో కె.కె.బి. గణనీయమైన ప్రగతి సాధించింది. అందులోని సభ్యులు ప్రతి రెండు మూడు నెలల కోసారి గ్రామాల్లోని నీటి నిల్వ కేంద్రాలను, ఆస్పత్రులను శుభ్రం చేస్తుంటారు. ఏ డాక్టర్లూ లేని గ్రామాలలోని వ్యాధిగ్రస్తులకు ఈ యువ సైన్యం ఔషధ మూలికలను సరఫరా చేసింది. కె.కె.బి. త్వరగా నేర్చుకున్న పాఠాల ఫలితంగా కోళ్ళకు టీకాలు వేసే కార్యక్రమాలు అమలవుతున్నాయి. మూడు నెలలకోసారి కోడికి టీకా మందు వేసినందుకు కె.కె.బి. 50 పైసలు తీసుకుంటుంది. గ్రామ పంచాయితీ పశు వైద్యశాలలోని ధర కన్నా అది అక్షరాలా రూపాయి తక్కువ.

పిల్లలకు వివిధ పనుల్లో నైపుణ్యం అబ్బేలా చేయడమే కాకుండా వారు తమ కుటుంబానికి ఆర్థికంగా ఉపయోగపడేందుకు కూడా కె.కె.బి. దోహదపడుతోంది. సర్వార్ సర్ధార్ తండ్రి ల్యాండ్ సర్వేయర్‌గా పనిచేస్తున్నారు. కానీ, ఆయన ఆదాయం ఇంటి అవసరాలకు చాలడం లేదు. దాంతో ఆయన తన తొమ్మిది మంది సంతానంలో పెద్దవాడిపై ఆధారపడ్డారు. పెద్దవాడైన సర్వార్‌కు ఇప్పుడు ఆ చుట్టుపక్కల ప్రాంతాలలో బోలెడంత పలుకుబడి. అతను కోళ్ళకు టీకా మందు ఇస్తూ సంపాదించ గలుగుతున్నాడు. ఇక పుతుల్ మండల్ కృషి వల్లే వారి కుటుంబం ఇప్పుడు సంతోషంగా, ఏ ఆర్థిక సమస్య లేకుండా గడపగలుగుతోంది. "మా ఇంటి చుట్టూ బోలెడంత స్థలం ఉండేది. కానీ, దాన్ని మేం ఏ విధంగానూ ఉపయోగించుకునే వాళ్ళం కాదు. అక్కడ కూరగాయల మొక్కలు పెంచి అమ్మడమెలాగో పుతులే నేర్పించింది" అని పుతుల్ అమ్మ ఆనందంతో చెప్పారు.

ఈ పరిణామం, పాఠశాలల్లోని పాఠ్యాంశాల విలువను ప్రశ్నార్థకం చేసింది. పుస్తకాలలోని పాఠాలకు, జీవితానికి ఏ మాత్రం సంబంధం ఉందని ప్రశ్నించింది. ఫాతుల్యాపూర్ ప్రాథమికోన్నత పాఠశాల ఉపాధ్యాయుడు రంజిత్ బిశ్వాస్, "పిల్లలకు వారి భవిష్యత్తులో ఉపయోగపడే వాటిని పాఠశాలలు ఇవ్వడం లేదు" అని అన్నారు. కె.కె.బి. తల్లిదండ్రుల సంఘమైన స్వానిర్వార్ అధ్యక్షుడు సుజిత్ సిన్హా ఈ పిల్లలు చేపట్టిన సృజనాత్మక కార్యక్రమాలను ఇతర ప్రాంతాలలో కూడా వ్యాప్తి చేయాల్సిన అవసరం ఉందని అభిప్రాయ పడ్డారు. ప్రిన్స్‌టన్ యూనివర్సిటీ పట్టభద్రుడైన సిన్హా "పశ్చిమ బెంగాల్‌లోని పల్లె ప్రాంతాలలో 5,600 ఉన్నత పాఠశాలలున్నాయి. వాటిలో 40 లక్షలకు పైగా విద్యార్థులున్నారు. ఇప్పటికీ, ఇంకా మనం సాంఘిక శాస్త్రాలను పట్టుకుని వేలాడాల్సిన అవసరముందా? పిల్లలకు పౌర జీవన వ్యవహారాలు, సామాజిక అభివృద్ధికి సంబంధించిన పాఠాలు కూడా చెప్పవచ్చు కదా? ఇప్పుడు పాఠశాలలను సాంఘిక అభివృద్ధి సంస్థలుగా చూడాల్సిన అవసరం చాలా ఉంది" అని అన్నారు. కె.కె.బి. ఇప్పటికే ఆ విధంగా ఎదిగిపోయింది. *

# చరిత్ర పుస్తకాలా? కాషాయ కరపత్రాలా!?

రెండవ ప్రపంచ యుద్ధానికి హిట్లర్, నాజీ జర్మనీలతో పాటు సోవియట్ యూనియన్‌కు కూడా బాధ్యత వున్నదని ఈ చరిత్ర పాఠ్య పుస్తకంలో పేర్కొన్నారు. అలీనోద్యమం గురించి కించపరిచే వ్యాఖ్యలు వున్నాయి. చారిత్రక ఘటనలకు సంబంధించి కూడా అనేక పొరపాట్లు వున్నాయి. చారిత్రకమైనవే కాక భౌగోళికపరమైన తప్పులు కూడా వున్నాయి. నిజానికి వీటిని ఎవరు మాత్రం పాఠ్య పుస్తకాలుగా అంగీకరించగలరు.

విద్యకు మతం రంగు పులమటమే ప్రస్తుత ఎజెండాగా వున్నది. ఇందుకుగాను కేంద్ర ప్రభుత్వ ఆధ్వర్యంలో వివిధ విభాగాలను సాధనాలుగా మార్చుకొని ప్రధానంగా చరిత్రపై దాడి సాగుతున్నది. పాఠశాల విద్యలో ఈ అజెండాను అమలు పరిచే ప్రధాన సాధనంగా ఎస్.సి.ఇ.ఆర్.టి. మారిపోయింది. గత ఏడాది కొత్తగా చరిత్ర పుస్తకాలను ఈ సంస్థ విడుదల చేసింది. వాటిలో మతతత్వ వక్రీకరణలూ, మౌలికమైన చారిత్రక సత్యాల విస్మరణా వున్నందున చరిత్రకారులూ, అధ్యాపకులు, ఇతర విద్యావేత్తలు, పత్రికలూ వీటిని విమర్శించాయి. ఢిల్లీలోను, ఇంకా కొన్ని ప్రాంతాలలోను గల పాఠశాలలు ఈ పుస్తకాలను వినియోగించరాదని నిర్ణయించాయి. ఈ పుస్తకాలపై మేధావుల అభిప్రాయాలను సహమత్ (సఫ్దర్ హష్మి మెమోరియల్ ట్రస్ట్) సేకరించింది.

### యధేచ్ఛగా వక్రీకరణలు

ఈ నూతన పాఠ్యపుస్తకాలలో పన్నెండవ తరగతికి ఉద్దేశించిన మోడరన్ ఇండియా (ఆధునిక భారతం)అన్నదొకటి. కురుక్షేత్ర విశ్వవిద్యాలయంలో చరిత్ర ప్రొఫెసర్‌గా వుద్యోగ విరమణ చేసిన సతీష్ చంద్ర మిట్టల్ దీనిని రచించారు. ఈయనగారే కొన్ని సంవత్సరాల క్రితం ఒక కరపత్రాన్ని తయారుచేశారు. చరిత్ర పుస్తకాలలో హిందూ-ముస్లిం ఐక్యత గురించీ, బహుళ సంస్కృతి గురించీ అతిగా నొక్కిచెప్పడం జరిగిందని ఆయన దానిలో విసుక్కొన్నాడు. ఈ రకమైన భావాలతో నిండివున్న పుస్తకాలను ఉపసంహరించుకోవాలని ఎన్.సి.ఇ.ఆర్.టి. నిశ్చయించడంతో వాటి స్థానంలో వుండవలసిన పుస్తకాలకు సహజంగానే ఈయనగారు రచయితగా నియమితులయ్యారు. ఈ పుస్తకానికి ఎస్.సి.ఇ.ఆర్.టి. డైరెక్టర్ ఒక ముందుమాట రాస్తూ "మొత్తం చరిత్ర స్వభావమే నూతన రచన పద్ధతుల వలన, అన్వేషణల వలన, దృక్పధాల వలన మారిపోయిందని" సెలవిచ్చారు. "నూతన రచనా పద్ధతులకు, అన్వేషణలకు, దృక్పధాలకు" ఈ పుస్తకం చక్కని ఉదాహరణ అనే చెప్పాలి. ఎస్.సి.ఇ.ఆర్.టి. చరిత్రకారుడు చరిత్రలోని ప్రాధమికాంశాల విషయంలో యధేచ్ఛగా ప్రవర్తించారని చెప్పవలసి వుంటుంది. ఇందుకు పై పాఠ్య పుస్తకం నుంచే కొన్ని ఉదాహరణలను చూపవచ్చు.

**246వ పేజీలో ఇలా వున్నది:** పంజాబ్ మాజీ లెఫ్టినెంట్ గవర్నర్ జనరల్ డయ్యర్ 1940లో కాల్పులకు గురై మరణించినట్లు పేర్కొనడం జరిగింది. (నిజానికి జనరల్ డయ్యర్ 1927లో మెదడు సంబంధమైన వ్యాధితో మరణించాడు. కాల్పులకు గురైన లెఫ్టినెంట్ గవర్నర్ పేరు మైఖేల్ ఒ డయ్యర్).

**అదే పేజీలో ఇలా వున్నది:** ఒక పరిశోధక రచయితను ఉదహరిస్తూ "తన పెద్ద సోదరుడు రాస్ బిహీర్ బోస్ వలెనే" దేశం నుండి తప్పించు కోవాల్సిందిగా సుభాష్ చంద్రబోస్‌కు సావర్కార్ సలహా ఇచ్చాడు. (జనులందరు సోదరతుల్యులు, బోసులందరూ ఇంకా అంతకన్నా ఎక్కువే అని ఈ రచయిత వుద్దేశ్యమై వుంటుంది.)

ఫార్వర్డ్ బ్లాక్‌ను సుభాష్ చంద్రబోస్ స్థాపించడంతో "గాంధేయవాదులు తీవ్రంగా స్పందించారు. దానితో ఆయన కాంగ్రెస్ అధ్యక్ష పదవికి రాజీనామా చేశారు." (అదే పేజీ) నిజానికి కాంగ్రెస్ అధ్యక్ష పదవికి రాజీనామా చేసిన తరువాతనే ఆయన ఫార్వర్డ్ బ్లాక్‌ను స్థాపించాడు. ఐ.ఎస్.ఎ.కు చెందిన ముగ్గురు ఉన్నతాధికారులను 'నిర్దోషులుగా' ప్రకటించినట్లు ఆ పక్క పుటలోనే (247) వున్నది. (వాస్తవమేమిటంటే వారిని దోషులుగా నిర్ణయించి తరువాత విడిచిపెట్టడం జరిగింది.)

ఛాపేకర్ సోదరులను ఇరువురు బ్రిటిష్ అధికారులు - రాండ్, అరిస్ట్ - మోసంతో పట్టుకొని వురితీశారు.( పేజీ-188).

అయితే మరికొన్ని పేజీల తరువాత రచయిత అభిప్రాయం మారిపోయినట్లున్నది. ఆయన ఇలా పేర్కొన్నాడు. "ఛాపేకర్ సోదరులు... ఈ ఇరువురు అధికారులను (రాండ్, అయిరిస్టులను, 168 పేజీలోని అరిస్ట్ 184వ పేజీలోకి వచ్చేసరికి అయిరిస్ట్‌గా మారిపోయాడు) హత్య చేయాలని నిర్ణయించుకొని ఆ రోజే అమలు చేశారు. ఇది 12వ తరగతి పుస్తకం కనుక దీని ఆధారంగానే పరీక్షలు జరుగుతాయి. పై దానిలో దేనిని జవాబుగా రాసినా సరైనదే అవుతుంది!

ముందుగా వూహించినట్లుగానే ఈ పుస్తకంలో సావర్కార్ గురించి చాలానే వున్నది. కమ్యూనిస్టుల గురించి కూడా ఒక పూర్తి పేజీ వున్నది. కమ్యూనిస్టులు క్విట్ ఇండియా వుద్యమాన్ని వ్యతిరేకించారని రాసిన (243-45) రచయిత సావర్కార్ విషయానికి వచ్చేసరికి "ఈ ఉద్యమంలో భాగస్వాములు కారాదని తన అనుచరులను ఆదేశించినట్లు" పేర్కొన్నాడు.

సావర్కార్, "హిందూ సంస్థల కార్యకలాపాలలో మునిగిపోయాడని", ఒకచోట (184) రాశారు. అయితే హిందూ మహాసభతో సహా దేని పేరును ప్రస్తావించలేదు. ఆయన హిందూ మహాసభ నాయకుడని గానీ, 1937లో దాని వార్షిక సమావేశానికి అధ్యక్షత వహించాడని గానీ, ఈ సందర్భంగానే ఆయన ద్విజాతి సిద్ధాంతాన్ని ప్రకటించాడని గానీ ఈ పుస్తకంలో ఎక్కడా పేర్కొనలేదు.

ఔరంగాబాద్‌లో జాన్సన్ హత్యకు గురయ్యాడని 185 పేజీలోనూ, నాసిక్‌లోనని 186వ పేజీలోనూ వున్నది.

ముస్లింలీగ్ గురించీ, ముస్లిం మతతత్వం గురించీ చెప్పిన వారు హిందూ మహాసభ గురించి మాత్రమే చెప్పి, హిందూ మతతత్వం గురించి మాత్రం చెప్పలేదు. "హిందువులలో సామాజిక, సాంస్కృతిక చైతన్యాన్ని పునరుజ్జీవింపచేయడమే" హిందూ మహాసభ లక్ష్యమని పేర్కొన్నారు. క్విట్ ఇండియా ఉద్యమాన్ని హిందూ మహాసభ వ్యతిరేకించిన సంగతిని ఎక్కడా

ప్రస్తావించలేదు. 'హిందూ మహాసభ వలెనే సిక్కు సమాజం కూడా నడుచుకున్నదని చెప్పడం జరిగింది.

**చరిత్రకు కొత్త అర్థాలు**

పన్నెండవ తరగతి విద్యార్థుల కోసం 'సమకాలీన ప్రపంచ చరిత్ర' అన్న పుస్తకాన్ని కూడా ఎస్.సి.ఇ.ఆర్.టి. ఈ మధ్యనే విడుదల చేసింది. మహమ్మద్ అన్వరుల్-హక్, ప్రత్యూష కె. మండల్‌తో పాటు ఉత్కళ విశ్వవిద్యాలయానికి చెందిన హిమాంశు ఎస్. పట్నాయక్ కలసి దానిని రచించారు. దీనిగురించి పత్రికలలో విరుద్ధమైన అభిప్రాయాలు వెలువడ్డాయి. అమెరికా స్ఫూర్తితో ఈ పుస్తకాన్ని రాసినట్లుగా కన్పిస్తున్నది. రెండవ ప్రపంచ యుద్ధానికి హిట్లర్, నాజీ జర్మనీలతో పాటు సోవియట్ యూనియన్‌కు కూడా బాధ్యత వున్నదని పేర్కొన్నారు. కమ్యూనిజం పట్ల 'సార్వత్రిక ద్వేషం' వుండటంతో దానిని అనువుగా చేసుకొని కొమింటర్న్ వ్యతిరేక ఒప్పందంపై జర్మన్, జపాన్‌లు సంతకాలు చేశాయి. యుద్ధానంతరం కమ్యూనిస్టులు అంతర్యుద్ధాన్ని ప్రారంభించారు. (పేజీ -170) అంతా ఇలాంటి సమాచారంతోనే నిండివున్నది. ఈ చరిత్రకారుడు ఇంకా ఇలా రాశాడు. "అమెరికా రహస్యాలను సంపాదించవలసిందిగా ప్రపంచవ్యాప్తంగా వున్న తన వేగులకు స్టాలిన్ చెప్పాడు. సోవియట్ యూనియన్‌ను తమ అసలైన దేశంగా భావించే కమ్యూనిస్టు సానుభూతిపరులు పలువురు పాశ్చాత్య దేశాలలో వున్నారు. వారి విద్రోహపూరిత కార్యకలాపాల కారణంగా ఆటంబాంబు తయారు చేయడానికి అవసరమైన పత్రాలు స్టాలిన్ చేతికి అందాయి. దానితో ఆయన అత్యున్నత స్థాయికి చెందిన అణుశాస్త్రవేత్తలను పాకిస్తాన్‌లోని ఒక రహస్య ప్రాంతానికి తరలించి బాంబును తయారు చేయవలసిందిగా బలవంతం చేశాడు. (పేజీ-172).

సోవియట్ యూనియన్‌కు అణు రహస్యాలను అందచేశారన్న ఆరోపణపై రోజన్ బర్గ్‌లను వురితీసి ఇప్పటికి 50 సంవత్సరాలైంది. ఈ వురిశిక్ష ప్రపంచాన్ని దిగ్భ్రాంతిపర్చింది. అంతేగాక అమెరికన్ న్యాయశాస్త్ర చరిత్రలో మాయని మచ్చగా మిగిలిపోయింది. రోజన్‌బర్గ్‌లను వురితీసి 50 సంవత్సరాలు గడిచిన సందర్భంగా న్యూయార్క్ టైమ్స్ పత్రిక ఒక సంపాదకీయంలో (2003 జూన్ 19) ఇలా పేర్కొన్నది. "రోజన్‌బర్గ్‌ల వుదంతం ఇప్పటికీ అమెరికన్ చరిత్రను వెంటాడుతున్నది. ఒక దేశం ఉన్మాదంలో కూరుకుపోయిన దశలో జరిగిన అన్యాయాన్ని మనకు గుర్తు చేస్తున్నది." కాగా ఈ వున్మత్తపూరిత వాతావరణాన్ని పునరుద్ధరించాలని చూడటం ఎస్.సి.ఇ.ఆర్.టి. చరిత్రకారులకు సిగ్గుచేటు చర్య అని చెప్పక తప్పదు. మన ప్రచ్ఛన్న యుద్ధకాలపు యోధుల అవగాహనను గురించి పోవియట్ - జర్మన్‌ల నిర్యుద్ధ సంధిలోని రహస్య ఒప్పందం మేరకు ఉక్రెయిన్, బైలో రష్యాలు సోవియట్‌కు దఖలుపడ్డాయి. నిజానికి 1922లో సోవియట్ స్థాపక రిపబ్లిక్‌లలో ఈ రెండు దేశాలు వున్నాయి. అయితే మన 'చరిత్రకారులకు' ఈ విషయం తెలియదు.

అలీనోద్యమం గురించి కూడా చరిత్ర పుస్తకంలో కించపరిచే వ్యాఖ్యలు వున్నాయి. ప్రచ్ఛన్న యుద్ధానంతర కాలంలో ఇది తన ప్రాధాన్యతను కోల్పోయిందని పేర్కొన్నారు. చారిత్రక ఘటనలకు సంబంధించి కూడా ఈ పుస్తకంలో అనేక పొరపాట్లు ఉన్నాయి. చారిత్రకమైనవే కాక భౌగోళికపరమైన తప్పులు కూడా వున్నాయి. నిజానికి వీటిని ఎవరు మాత్రం పాఠ్య పుస్తకాలుగా అంగీకరించగలరు.

# కాషాయ కల్మషాన్ని కడిగివేయాలి

ఆరేళ్ళపాటు సాగిన బిజెపి నేతృత్వంలోని పాలనలో జాతీయస్థాయికి చెందిన విద్యా సాంస్కృతిక సంస్థలకు అపారనష్టం వాటిల్లింది. ఇవి తమ స్వయం ప్రతిపత్తినీ, వృత్తి సామర్థ్యాన్నీ కోల్పోయాయి. బిజెపి అదే విధంగా దాని మాతృసంస్థయైన ఆరెస్సెస్ తయారు చేసిన మతతత్వ అజెండాను అమలు జరిపే సంస్థలుగా అవి మారిపోయాయి. అధికారాన్ని చేపట్టిన స్వల్ప కాలంలోనే జాతీయస్థాయి సంస్థల అధిపతులుగా మతతత్వ భావజాలాలు కలిగిన వారిని బిజెపి నేతృత్వంలోని ప్రభుత్వం నియమించింది.

కేంద్రంలో ఏర్పడిన కొత్త ప్రభుత్వానికి ప్రముఖ ఆర్థికవేత్త ప్రభాత్ పట్నాయక్, చరిత్రకారులు అర్జున్‌దేవ్, డిఎన్‌ఝా, కళారంగ ప్రముఖులు ఎంఆర్ రైనాతో సహా పలువురు మేధావులు సంయుక్తంగా రాసిన లేఖలోని అంశాలు ఈ దిగువనిస్తున్నాం.

బిజెపి నేతృత్వంలోని ప్రభుత్వం గత ఆరేళ్ళకాలంలో దేశంలోని విద్య, సాంకేతిక సంస్థలకు చేసిన హానిని కేంద్రాధికారాన్ని చేపట్టిన నూతన సమైక్య ప్రగతిశీల కూటమి (యుపిఎ) ప్రభుత్వం సరిదిద్దాలి. జరిగిన నష్టం "అపారంగా" వున్నందున ఇక ఎంత మాత్రం కాలయాపన లేకుండా సత్వరమే చర్యలు తీసుకోవాల్సివుంది.

'ఈ తరహా నష్టాలను సరిదిద్దమంటూ' ప్రజలు తీర్పు ఇచ్చినందున సరైన దిశలో నూతన ప్రభుత్వం తగిన చర్యలను చేపట్టాలి. ఒకవైపున లక్షలాది దేశస్తులు ఆకలితో చనిపోతుంటే మరోవైపు నామమాత్రపు ధరలకు ధాన్యాన్ని విదేశాలకు ఎగుమతి చేశారు. అదే విధంగా ప్రభుత్వరంగ సంస్థలను కారుచౌకగా అమ్మివేశారు. బిజెపి నేతృత్వంలోని ప్రభుత్వం వైదొలగడంతో స్టాక్ మార్కెట్లు కుప్పకూలాయి. అంతర్జాతీయ పెట్టుబడులకూ, హిందూత్వంకూ మధ్య ఏర్పడిన అపవిత్రపు పొత్తు దీనితో బహిర్గతమైంది. "విద్యా, సాంస్కృతిక సంస్థలలో పేరుకుపోయిన కల్మషాన్ని కడిగివేయాలి. నూతన ప్రభుత్వం, కార్యాచరణ స్వేచ్ఛను కల్పించాలి.

సామాజిక శాస్త్రాలకూ, ప్రత్యేకించి చరిత్రకు నష్టం వాటిల్లింది. తత్కారణంగా మెదళ్ళు విషపూరితం కావడమేకాక చరిత్ర పెద్దఎత్తున వక్రీకరణకు గురైంది. బిసిహెచ్ఆర్, ఎన్‌సిఇఆర్‌టి వంటి సంస్థలలోకి కాషాయ మూకలు చొరబడి స్వాతంత్ర్య పోరాట చరిత్ర పుస్తకాలను నిషేధించాయి. వాటిని సరిదిద్దవలసివుంది. కీలకమైన స్థానాలలో జరిగిన నియామకాలపై విచారణ జరపాలి. మైనారిటీలపై గుజరాత్ ముఖ్యమంత్రి నరేంద్రమోడీ చేసిన ఘాతుకాలకు గాను ఆయనపై విచారణ జరపాలి. విద్వేషపూరితమైన రాజకీయాలను, విభజనలను వ్యతిరేకిస్తూ అదే విధంగా మానవీయమైన, న్యాయబద్ధమైన పరిపాలనను ఆశిస్తూ భారత ప్రజలు విస్పష్టమైన తీర్పు ఇచ్చారు. 2002 నాటి గుజరాత్ నరమేథం అటు గుజరాతీయులనూ ఇటు మొత్తంగా భారతీయులనూ భీతావహులను చేసింది. 2002 డిసెంబర్‌లో జరిగిన గుజరాత్ ఎన్నికలలో సైతం 49 శాతం మంది ప్రజలు ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఓటు చేశారు. అయినప్పటికీ గుజరాత్‌లోని బిజెపి ప్రభుత్వం అక్కడి మారణకాండకు బాధ్యత వహించకపోగా ఎన్నికల విజయోత్సవాన్ని జరుపుకొన్నది.

కాగా ఇప్పుడు రెండేళ్ళ అనంతరం కులం, జాతి భేదాలతో నిమిత్తం లేకుండా హేతుబద్ధంగా ఆలోచించే భారతీయుల వైఖరి సరైనదేనని రుజువైంది. ఇటీవల ముగిసిన ఎన్నికలలో లౌకికతత్వ ప్రాతిపదికన పోటీచేసిన కాంగ్రెస్ పార్టీ గుజరాత్‌లోని 92 శాసన సభా నియోజకవర్గాలలో విజయాన్ని సాధించింది. బిజెపి 90 నియోజక వర్గాలలో మాత్రమే ఆధిక్యతను పొందింది. విచ్ఛిన్నకరమైన మతతత్వ రాజకీయాలకు భారతదేశంలో స్థానంలేదని ఈనాడు భారత ప్రజలు నిర్ద్వంద్వంగా తేల్చిచెప్పారు. ఈ దేశంలోని నాగరికతా మూలాలు ప్రగాఢంగా కలిగిన గౌరవప్రదమైన జీవితాన్ని, శాంతినీ, సామరస్యాన్ని ప్రజలు కాంక్షిస్తున్నారు. ప్రజల తీర్పుపట్ల హర్షాన్ని ప్రకటిస్తూనే, గుజరాత్ బాధితులకు న్యాయాన్ని చేయవలసిందిగా నూతన ప్రభుత్వాన్ని మేము కోరుతున్నాము. అదే విధంగా వివిధ సంస్థలలోని కీలక పదవులలో ఆరెస్సెస్ వాదులను నియమించటం వల్ల కలిగిన నష్టాన్ని సరిదిద్దమని, విద్యారంగంలో కాషాయ కల్మషాన్ని కడిగి వేసి, సంఘపరివార్ మూకల ప్రమాదం లేని సామరస్యపూరిత వాతావరణాన్ని నెలకొల్పవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాము.

సృజనాత్మకతనూ, పాండిత్యాన్నీ అణచివేసే దుర్ఘటనలు గత ఏడాది సంభవించాయి. మధ్యప్రదేశ్‌లో హబీబ్ తన్వీర్‌పై దాడులు, పూనాలో భండార్కర్ పరిశోధనాగారంపై కిరాతకదాడులు, సూరత్‌లో చిత్ర ప్రదర్శన విధ్వంసం వంటివి విహెచ్‌పి, భజరంగదళ్ ఆటవికతత్వాన్ని తెలియచెప్తున్నాయి. ఈ రకమైన దురభిమానాలను ప్రజాతంత్ర సమాజం ఏరిపారవేయవలసి వుంది.

'గుజరాత్‌లో ప్రభుత్వ ప్రేరిత మతహింసాకాండలో బాధితులుగా మారిన వారి గురించి లౌకికబృందాలు ఇతర పౌరులు చెప్తున్నదానిని ధ్రువీకరించేవిధంగా ఇటీవల బెస్ట్ బేకరీ కేసులో సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పు వున్నది. పాలకులనూ, అధికారులనూ 'ఆధునిక కాలపు నీరోలంటూ' ఈ తీర్పులో పేర్కొనటం జరిగింది.

దేశంలోని వివిధ విద్యా- సాంస్కృతిక సంస్థలకు ఆరేళ్ళకాలంలో జరిగిన నష్టాన్ని సరిదిద్దే తక్షణ చర్యలను చేపట్టవలసిన బాధ్యత నూతన ప్రభుత్వంపై వున్నది. ఇందుకుగాను నిర్దిష్టచర్యలు తక్షణమే చేపట్టవలసిందిగా సమైక్య ప్రగతిశీల కూటమి ప్రభుత్వాన్ని మేము కోరుతున్నాము.

(ఐఎన్ఎన్)

* జాతీయ విద్యా పరిశోధన - శిక్షణ మండలి (ఎన్.సి.ఇ.ఆర్.టి.), భారత పరిశోధనా మండలి (ఐ.సి.హెచ్.ఆర్.), విశ్వ విద్యాలయ గ్రాంట్ల కమిషన్ (యు.జి.సి.), ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ అడ్వాన్స్‌డ్ స్టడీస్ (ఐ.ఐ.ఎ.ఎస్.), భారత సామాజిక శాస్త్రాల పరిశోధనా మండలి (ఐ.సి.ఎస్.ఎస్.ఆర్), భారత తాత్విక పరిశోధనా మండలి (ఐ.సి.పి.ఆర్.), ఇందిరాగాంధీ జాతీయ కళాకేంద్రం (ఐ.సి.ఎస్.ఎస్.ఆర్.), జాతీయ ఉపాధ్యాయ విద్యా మండలి (ఎస్.సి.టి.ఇ.), నేషనల్ ఓపెన్ స్కూల్ (ఎన్.ఒ.ఎస్.), జాతీయ విద్యా ప్రణాళికా - పరిపాలనా మండలి (ఎన్.ఐ.ఐ.సి.ఎ) వంటి వాటి పని విధానంపై విచారణ జరపాలి. ఈ సంస్థల వృత్తి నైపుణ్యాన్ని, స్వభావాన్ని పునరుద్ధరించడానికి తగిన చర్యలు చేపట్టాలి.
* బిజెపి మతతత్వ అజెండాను అమలు చేయడంలో ఆయా సంస్థలను ఉపయోగించడానికై తమ అధికారాన్ని దుర్వినియోగపరచిన సంస్థల అధిపతులపై చర్యలను చేపట్టాలి. నిబంధనలను విస్మరించినందుకుగాను వారిపై చర్య తీసుకోవాలి.
* విద్యా సంస్థల సిబ్బందిని వేధించిన ఘటనలపై విచారణ జరపాలి. అలానే వేధింపుల్లో భాగంగా చేసిన బదిలీలను రద్దు చేయాలి.
* బిజెపి నేతృత్వంలోని ప్రభుత్వం ద్వారా నియమితులైన వివిధ సంస్థల అధిపతులు చేసిన నియామకాలపైన, ఇచ్చిన ప్రమోషన్లపైనా విచారణ జరపాలి.
* ఈ సంస్థలు చేపట్టిన కార్యకలాపాలను పరిశీలించేటందుకై విచారణా సంస్థలను నియమించాలి. మతతత్వ అజెండాకు ఈ సంస్థలు కేటాయించిన నిధులను నిలిపివేయాలి.
* ఐసిహెచ్ఆర్ ఆధ్వర్యాన రూపొందించిన 'టు వర్డ్స్ ఫ్రీడమ్' అన్న గ్రంథ సంపుటాలను తక్షణమే ప్రచురించాలి. బిజెపి నేతృత్వంలోని ప్రభుత్వ

ఉత్తర్వుల మేరకు దేశంలో వీటి ప్రచురణను నిలిపివేయడం జరిగింది.

* బిజెపి నేతృత్వంలోని ప్రభుత్వం నిరాకరించిన కేంద్ర విద్యా సలహా బోర్డు పునర్వ్యవస్థీకరణకు వెంటనే చర్యలు తీసుకోవాలి.
* ఎన్.ఎఫ్.ఎన్.సి.ఇ. ని రద్దు చేసి పాఠ్యాంశాల రూపకల్పన కాక కమిటీని నియమించాలి.
* ఎన్.సి.ఇ.ఆర్.టి. రూపొందించిన సిలబస్‌ను పరిశీలించడానికి నిపుణుల కమిటీని నియమించాలి.
* 2002-04 మధ్య కాలంలో ఎన్.సి.ఇ.ఆర్.టి. రూపొందించిన నూతన సామాజిక శాస్త్ర గ్రంథాలను, చరిత్ర గ్రంథాలను రద్దు చేయాలి. ఇవి మతపరమైన వక్రీకరణలతో కూడివున్నాయి. వీటి పునర్ముద్రణను తక్షణమే నిలిపివేసే చర్యలను చేపట్టాలి.
* 2001 వరకు వున్న సామాజిక శాస్త్ర గ్రంథాల పునరుద్ధరణకు చర్యలు చేపట్టాలి.
* మతతత్వాన్ని, సంకుచితవాదాన్ని వ్యాపింపచేసే ఎన్.ఒ.ఎస్. గ్రంథాలను ఉపసంహరించాలి.
* సంఘ పరివార్‌కు చెందిన వివిధ సంస్థలు నడిపే పాఠశాలలకు నిధులను ఇవ్వటాన్ని తక్షణమే నిలిపివేయాలి.
* విశ్వ విద్యాలయాలు, ఇతర ఉన్నత విద్యా సంస్థల స్వయం ప్రతిపత్తిని కబళించే యుజిసి చర్యలను తక్షణమే నిలిపివేయాలి.
* ఐఐఎంల పనిలో జోక్యాన్ని నివారించాలి. అన్ని విశ్వ విద్యాలయాలలోని సాంకేతిక-యాజమాన్య ప్రవేశం కోసం నిర్వహించే కేంద్ర ప్రవేశ పరీక్షలను నిలిపివేయాలి.

-ప్రజాశక్తి సౌజన్యంతో

# యుటియఫ్ రాష్ట్ర మహాసభలు

ఉపాధ్యాయ ఉద్యమ చరిత్రలోనే చరిత్ర సృష్టించిన సందర్భంగా
ఈ నూతన విద్యా సంవత్సరంలో
యుటియఫ్ నాయకత్వంలో ఉపాధ్యాయుల సంక్షేమం
విద్యా వికాసం మరింత వెల్లివిరియాలని ఆకాంక్షిస్తూ



**అభినందనలతో**

| శ్రీమతి జ్యోత్స్న రోజిలిన్<br>అధ్యక్షులు | జె. రమేశ్<br>సహాధ్యక్షులు | కె. సుఖ్‌దేవ్<br>ప్రధానకార్యదర్శి |
|---|---|---|
| శ్రీమతి సుజాతమ్మ<br>కోశాధికారి | కార్యదర్శులు<br>ఎస్. వెంకట్రావ్<br>వెంకటేశ్వర్లు | కె. వేణు గోపాల్<br>జిల్లా ఆడిట్ కమిటీ సభ్యులు |

## ఆంధ్రప్రదేశ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్

బాలానగర్ మండల శాఖ, రంగారెడ్డి జిల్లా

# 2004 ఎన్నికలు- గుణపాఠాలు

ఎన్నికల ఫలితాలు ప్రకటించక పూర్వమే గత నెల మన పత్రిక సంపాదకీయంలో ఫలితాలను గూర్చి మన అంచనా వ్రాశాం. గాలి మారుతోందని స్పష్టంగా చెప్పాం. మన అంచనా సరియైనదని ఎన్నికల ఫలితాలు రుజువు చేశాయి.

కేంద్రంలో స్వంతంగా ఏ పార్టీకి మెజార్టీ రాకపోయినా కాంగ్రెస్ (145) దాని మిత్రపక్షాలకు(74) వామపక్షాల(61) నికర మద్దతుతో సుస్థిర ప్రభుత్వానికి కావలసిన మెజారిటీ లభించింది. ప్రభుత్వంలో చేరకుండానే వామ పక్షాలతోపాటు ములాయం సింగ్, మాయావతి పార్టీలు కూడ మద్దతు తెలిపాయి.

సోనియా గాంధీ విదేశీయత మీద బి.జె.పి. సాగించిన ప్రచారం పసలేనిదని ప్రజలు త్రోసిపుచ్చారు. ప్రధానమంత్రి పదవికి సోనియా గాంధిని మిత్రపక్షాలు ఏకగ్రీవంగా ఎన్నుకొన్నా, ఆమె నాటకీయంగా, హుందాగా ఆ పదవిని తిరస్కరించడం అందరినీ ఆశ్చర్యపరచింది. బి.జె.పి. నోటికి తాళం పడింది.

నూతన ఆర్థిక సంస్కరణల రూపశిల్పి అయిన డా॥ మన్మోహన్ సింగే ప్రధాన మంత్రి పదవిని చేపట్టినా పరిస్థితుల ప్రభావంచేత ఆయన నడక మారింది. వేగం తగ్గింది. ఆర్థిక సంస్కరణలకు మానవీయత తోడైంది. ఇది శుభపరిణామం; వామ పక్షాల పుణ్యం.

మన రాష్ట్రంలో చంద్రబాబు ఓటమి మామూలు ఓటమి కాదు. చావు దెబ్బ. 24 గంటలు ప్రజలకు వ్యతిరేకంగా పనిచేసే ముఖ్యమంత్రి మాకు పని లేదని, 4 గంటలు తగ్గినా ప్రజాసంక్షేమం కొరకు పని చేసే ముఖ్యమంత్రి కావాలని ప్రజలు తీర్పు యిచ్చారు. ప్రజలు 50% నిరక్షరాస్యులైనా చదువుకున్న వారి కంటే మేధావులని రుజువు చేశారు. తమ భావాలను ఏ సర్వేలకు అందకుండా గుంభనంగా దాచుకున్నారు. అందరి మీటింగులకు వెళ్లారు. అందరు యిచ్చిన డబ్బును నిర్మొహమాటంగా తీసుకున్నారు. కాని వాటికి అమ్ముడు పోలేదు. తాము అనుకున్న వారికే ఓటేశారు. దేశ వ్యాప్తంగా ప్రజలు లౌకికవాదం, ఆర్థిక సంస్కరణలకు వ్యతిరేకంగా ఓటు వేశారు. అందుకే వామపక్షేతర ప్రభుత్వ రాష్ట్రాలలో ప్రభుత్వాలకు వ్యతిరేకంగా ఓటు వేసినా, పశ్చిమ బెంగాల్, త్రిపుర రాష్ట్రాలలో ప్రభుత్వాలకు అనుకూలంగానే ఓటు వేశారు.

ఈ తీర్పు నుండి అందరూ గుణపాఠం నేర్చుకున్నారు గాని మన రాష్ట్రంలో అసంతృప్తులు, అలకలు, కుమ్ములాటలు కొందరు బహిరంగంగానే సాగిస్తున్నారు. కాని ముఖ్యమంత్రి రాజశేఖర రెడ్డిగారు హుందాగా తనపనితాను చేసుకొని పోతున్నారు. వాగ్దానాలు అమలు జరపడానికి కృషి చేస్తున్నారు. కొంత కాలం గడిస్తేనే గాని ఈ ప్రభుత్వ నడక ఎలాసాగేది నిర్ధారించలేము. అందుకని మనం నిరంతరం అప్రమత్తంగా ఉండి ప్రభుత్వ తీరుతెన్నులను గమనిస్తూ ఉందాం. గతి తప్పితే గతాన్ని గుర్తు చేద్దాం.

## రాష్ట్ర శాసన సభలో వివిధ పార్టీల బలాబలాలు

| పార్టీ | 1999 | 2004 |
|---|---|---|
| తెలుగు దేశం | 180 | 47 |
| కాంగ్రెస్ | 90 | 186 |
| బి.జె.పి. | 12 | 02 |
| యం.ఐ.యం. | 04 | 04 |
| సి.పి.ఐ.(యం.) | 02 | 09 |
| సి.పి.ఐ. | - | 06 |
| సి.పి.ఐ.(ఎం.ఎల్.) | 01 | 01 |
| టి.ఆర్.ఎస్. | 01 | 26 |
| జనతా పార్టీ | - | 02 |
| సమాజవాది పార్టీ | - | 01 |
| బి.ఎస్.పి. | - | 01 |
| ఇతరులు | 04 | 09 |
| | 294 | 294 |

# ఆంధ్రప్రదేశ్
## పన్నెండో శాసనసభకు ఎన్నికైనవారు

**శ్రీకాకుళం జిల్లా (12)**

| | |
|---|---|
| ఇచ్ఛాపురం | నరేష్ కుమార్ అగర్వాల్ (కాంగ్రెస్) |
| టెక్కలి | అప్పయ్యదొర (కాంగ్రెస్) |
| నర్సన్న పేట | డాక్టర్ కృష్ణదాస్ (కాంగ్రెస్) |
| ఆముదాలవలస | బొడ్డేపల్లి సత్యవతి (కాంగ్రెస్) |
| శ్రీకాకుళం | ధర్మాన ప్రసాదరావు (కాంగ్రెస్) |
| కొత్తూరు | జె.ఎం.గొమాంగో (కాంగ్రెస్) |
| పార్వతీపురం | ఎస్. విజయరామరాజు (కాంగ్రెస్) |
| సోంపేట | జి.ఎస్.ఎస్. శివాజీ (టి.డి.పి.) |
| హరిశ్చంద్రాపురం | అచ్చన్నాయుడు (టి.డి.పి.) |
| పాతపట్నం | కలమట మోహన రావు (టి.డి.పి.) |
| ఉణుకూరు | కె. కళావెంకటరావు (టి.డి.పి.) |
| సాలూరు | భాంజ్‌దేవ్ (టి.డి.పి.) |

**విజయనగరం జిల్లా (12)**

| | |
|---|---|
| ఎచ్చెర్ల | కె. మురళీమోహన్ (కాంగ్రెస్) |
| బొబ్బిలి | ఆర్.వి.ఎస్.కె. రంగా రావు (కాంగ్రెస్) |
| చీపురుపల్లి | బొత్స సత్యనారాయణ (కాంగ్రెస్) |
| సతివాడ | పి. సాంబశివరాజు (కాంగ్రెస్) |
| ఎస్.కోట | కె. రవిబాబు (కాంగ్రెస్) |
| ఉత్తరా పల్లి | పూడిమంగపతి రాజు (కాంగ్రెస్) |
| పాలకొండ | జోగులు (టి.డి.పి.) |
| తెర్లాం | జయప్రకాశ్ (టి.డి.పి.) |
| గజపతి నగరం | పడాల అరుణ (టి.డి.పి.) |
| భోగాపురం | నారాయణ స్వామి నాయుడు (టి.డి.పి) |
| నాగూరు | కె. లక్ష్మణ మూర్తి (సి.పి.ఎం.) |
| విజయనగరం | కె. వీర భద్ర స్వామి (ఇండి) |

**విశాఖపట్నం జిల్లా (13)**

| | |
|---|---|
| భీమునిపట్నం | కర్రి సీతారాం (కాంగ్రెస్) |
| విశాఖ-1 | డి. సత్యనారాయణ (కాంగ్రెస్) |
| విశాఖ-2 | రంగరాజు (కాంగ్రెస్) |
| పెందుర్తి | గురుమూర్తి రెడ్డి (కాంగ్రెస్) |
| మాడుగుల | కరణం ధర్మశ్రీ (కాంగ్రెస్) |
| అనకాపల్లి | కొణతాల రామకృష్ణ (కాంగ్రెస్) |
| పరవాడ | బాబ్జీ గాంధీ (కాంగ్రెస్) |
| యలమంచిలి | వెంకటరమణమూర్తి రాజు (కాంగ్రెస్) |
| చోడవరం | గంటా శ్రీనివాసరావు (టి.డి.పి.) |
| పాయకరావు పేట | చెంగల వెంకటరావు (టి.డి.పి.) |
| నర్సీపట్నం | అయ్యన్నపాత్రుడు (టి.డి.పి.) |
| చింతపల్లి | దేముడు (సి.పి.ఐ.) |
| పాడేరు | లకే రాజారావు (బీఎస్‌పీ) |

**తూర్పుగోదావరి జిల్లా (21)**

| | |
|---|---|
| బూరుగుపూడి | చిట్టూరి రవీంద్ర (కాంగ్రెస్) |
| రాజమండ్రి | రౌతు సూర్యప్రకాష్ (కాంగ్రెస్) |
| కడియం | జె. రామ్మోహనరావు (కాంగ్రెస్) |
| జగ్గంపేట | తోట వెంకటనరసింహం (కాంగ్రెస్) |
| పెద్దాపురం | తోట గోపాలకృష్ణ (కాంగ్రెస్) |
| ప్రత్తిపాడు | పరుపుల సుబ్బారావు (కాంగ్రెస్) |
| సంపర | ఎ బుల్లబ్బాయి రెడ్డి (కాంగ్రెస్) |
| కాకినాడ | ముత్తా గోపాలకృష్ణ (కాంగ్రెస్) |

| | |
|---|---|
| తాళ్ల రేవు | దొమ్మేటి వెంకటేశ్వర్లు **(కాంగ్రెస్)** |
| అనపర్తి | రామారెడ్డి తేతలి **(కాంగ్రెస్)** |
| ఆలమూరు | బి. కృష్ణార్జున్ చౌదరి **(కాంగ్రెస్)** |
| ముమ్మిడివరం | విశ్వరూప్ **(కాంగ్రెస్)** |
| అల్లవరం | గొల్లపల్లి సూర్యారావు **(కాంగ్రెస్)** |
| కొత్తపేట | చర్ల జగ్గిరెడ్డి **(కాంగ్రెస్)** |
| నగరం | పి. రాజేశ్వరీదేవి **(కాంగ్రెస్)** |
| రాజోలు | అల్లూరి కృష్ణంరాజు **(కాంగ్రెస్)** |
| ఎల్లవరం | చిన్నం బాబు రమేశ్ **(టి.డి.పి.)** |
| తుని | యనమల రామకృష్ణుడు **(టి.డి.పి.)** |
| పిఠాపురం | పి. దొరబాబు **(భాజపా)** |
| రామచంద్రాపురం | పిల్లి సుభాష్ చంద్రబోస్ **(ఇండి)** |
| అమలాపురం | చిట్టబ్బాయి **(ఇండి)** |
| **పశ్చిమ గోదావరి జిల్లా (16)** | |
| భీమవరం | జి. శ్రీనివాస్ **(కాంగ్రెస్)** |
| ఉండి | పాతపాటి సర్రాజు **(కాంగ్రెస్)** |
| పెనుగొండ | పితాని సత్యనారాయణ **(కాంగ్రెస్)** |
| తణుకు | చిట్టూరి బాపినీడు **(కాంగ్రెస్)** |
| అత్తిలి | రంగనాథరాజు **(కాంగ్రెస్)** |
| తాడేపల్లిగూడెం | కొట్టు సత్యనారాయణ **(కాంగ్రెస్)** |
| ఉంగుటూరు | వట్టి వసంతకుమార్ **(కాంగ్రెస్)** |
| దెందులూరు | ఎం. వెంకటేశ్వర రావు **(కాంగ్రెస్)** |
| ఏలూరు | ఆళ్లనాని **(కాంగ్రెస్)** |
| గోపాల పురం | మద్దాలి సునీత **(కాంగ్రెస్)** |
| పోలవరం | తెల్లం బాలరాజు **(కాంగ్రెస్)** |
| చింతలపూడి | గంటా మురళీకృష్ణ **(కాంగ్రెస్)** |
| నర్సాపురం | కొత్తపల్లి సుబ్బారాయుడు **(టి.డి.పి.)** |
| పాలకొల్లు | డా॥ సి. సత్యనారాయణ మూర్తి **(టి.డి.పి.)** |
| ఆచంట | పీతల సుజాత **(టి.డి.పి.)** |
| కొవ్వూరు | కృష్ణబాబు **(టి.డి.పి.)** |
| **కృష్ణా జిల్లా (17)** | |
| జగ్గయ్యపేట | సామినేని ఉదయభాను **(కాంగ్రెస్)** |
| విజయవాడ(తూ) | రాధాకృష్ణ **(కాంగ్రెస్)** |
| కంకిపాడు | దేవినేని రాజశేఖర్ **(కాంగ్రెస్)** |
| మైలవరం | చనుమోలు వెంకట్రావు **(కాంగ్రెస్)** |
| తిరువూరు | కోనేరు రంగారావు **(కాంగ్రెస్)** |
| నూజివీడు | ఎం.వి.పి. అప్పారావు **(కాంగ్రెస్)** |
| ఉయ్యూరు | కె. పార్థసారథి **(కాంగ్రెస్)** |
| ముదినేపల్లి | పి. వెంకటేశ్వర రావు **(కాంగ్రెస్)** |
| కైకలూరు | రాజారామచందర్ **(కాంగ్రెస్)** |
| మల్లేశ్వరం | బూరగడ్డ వేదవ్యాస్ **(కాంగ్రెస్)** |
| మచిలీపట్నం | పేర్ని వెంకట్రామయ్య **(కాంగ్రెస్)** |
| అవనిగడ్డ | మండలి బుద్ధ ప్రసాద్ **(కాంగ్రెస్)** |
| నందిగామ | ఉమామహేశ్వర రావు **(టి.డి.పి.)** |
| గుడివాడ | కొడాలి వెంకటేశ్వర రావు **(టి.డి.పి.)** |
| నిడుమోలు | పాటూరి రామయ్య **(సి.పి.ఎం.)** |
| విజయవాడ (ప) | నాజర్‌వలి **(సి.పి.ఐ.)** |
| గన్నవరం | ఎం. వెంకటేశ్వర రావు **(ఇండి)** |
| **గుంటూరు జిల్లా (19)** | |
| కూచినపూడి | ఎం. వెంకటరమణ రావు **(కాంగ్రెస్)** |
| రేపల్లె | దేవినేని మల్లికార్జున రావు **(కాంగ్రెస్)** |
| వేమూరు | పాల్‌రాజ్ సతీష్ **(కాంగ్రెస్)** |
| దుగ్గిరాల | గుదిబండి వెంకటరెడ్డి **(కాంగ్రెస్)** |
| తెనాలి | నాదెండ్ల మనోహర్ **(కాంగ్రెస్)** |
| బాపట్ల | గాదె వెంకటరెడ్డి **(కాంగ్రెస్)** |
| పత్తిపాడు | రావి వెంకటరమణ **(కాంగ్రెస్)** |
| గుంటూరు-1 | నంబూరి సుభాని **(కాంగ్రెస్)** |
| గుంటూరు-2 | వెంకట్రావు **(కాంగ్రెస్)** |
| మంగళగిరి | ఎం. హనుమంత రావు **(కాంగ్రెస్)** |
| తాడికొండ | వరప్రసాదరావు **(కాంగ్రెస్)** |
| సత్తెనపల్లి | యర్రం వెంకటేశ్వర రెడ్డి **(కాంగ్రెస్)** |
| పెదకూర పాదు | కన్నా లక్ష్మీ నారాయణ **(కాంగ్రెస్)** |
| గురజాల | జంగాకృష్ణమూర్తి **(కాంగ్రెస్)** |
| మాచర్ల | పిన్నెల్లి లక్ష్మారెడ్డి **(కాంగ్రెస్)** |
| వినుకొండ | మక్కెన మల్లికార్జున రావు **(కాంగ్రెస్)** |
| నరసరావుపేట | కాసు కృష్ణా రెడ్డి **(కాంగ్రెస్)** |
| పొన్నూరు | డి. నరేంద్రకుమార్ **(టి.డి.పి.)** |
| చిలకలూరి పేట | మర్రి రాజశేఖర్ **(ఇండి)** |
| **ప్రకాశం జిల్లా (13)** | |
| చీరాల | కె. రోశయ్య **(కాంగ్రెస్)** |
| పర్చూరు | డి. వెంకటేశ్వర రావు **(కాంగ్రెస్)** |
| మార్టూరు | గొట్టిపాటి రవికుమార్ **(కాంగ్రెస్)** |
| ఒంగోలు | బాలినేని శ్రీనివాస రెడ్డి **(కాంగ్రెస్)** |
| సంతనూతలపాడు | డి. సాంబయ్య **(కాంగ్రెస్)** |
| కందుకూరు | మహీధర్ రెడ్డి **(కాంగ్రెస్)** |
| కనిగిరి | ఇ. తిరుపతి నాయుడు **(కాంగ్రెస్)** |
| కొండెపి | పి. రామారావు**(కాంగ్రెస్)** |
| కంభం | శ్రీనివాస్ రెడ్డి **(కాంగ్రెస్)** |
| మార్కాపురం | కె.పి.కొండారెడ్డి **(కాంగ్రెస్)** |
| గిద్దలూరు | పగడాల రామయ్య **(కాంగ్రెస్)** |
| అద్దంకి | కె.బి.కృష్ణమూర్తి **(టి.డి.పి.)** |
| దర్శి | సుబ్బా రెడ్డి **(ఇండి)** |
| **నెల్లూరు జిల్లా (11)** | |
| ఉదయగిరి | ఎం చంద్రశేఖర రెడ్డి **(కాంగ్రెస్)** |
| కావలి | మాగుంట పార్వతమ్మ **(కాంగ్రెస్)** |
| అల్లూరు | విష్ణువర్ధన్ రెడ్డి **(కాంగ్రెస్)** |
| కోవూరు | పి. శ్రీనివాసులరెడ్డి **(కాంగ్రెస్)** |
| రాపూరు | ఆనం రామనారాయణ రెడ్డి **(కాంగ్రెస్)** |
| నెల్లూరు | ఆనం వివేకానంద రెడ్డి **(కాంగ్రెస్)** |
| సర్వేపల్లి | ఆదాల ప్రభాకర రెడ్డి **(కాంగ్రెస్)** |
| గూడూరు | పట్రా ప్రకాశరావు **(కాంగ్రెస్)** |
| సూళ్లూరు పేట | నెలవల సుబ్రహ్మణ్యం **(కాంగ్రెస్)** |
| వెంకటగిరి | నేదురుమల్లి రాజ్యలక్ష్మి **(కాంగ్రెస్)** |
| ఆత్మకూరు | కొమ్మి లక్ష్మయ్య నాయుడు **(ఇండి)** |
| **చిత్తూరు జిల్లా (15)** | |
| శ్రీకాళహస్తి | సుబ్రహ్మణ్యం నాయుడు **(కాంగ్రెస్)** |
| సత్యవేడు | కె. నారాయణ స్వామి **(కాంగ్రెస్)** |
| నగరి | చెంగారెడ్డి **(కాంగ్రెస్)** |
| పుత్తూరు | జి.ముద్దుకృష్ణమ నాయుడు **(కాంగ్రెస్)** |
| వేపంజేరి | కుతూహలమ్మ **(కాంగ్రెస్)** |
| తంబళ్లపల్లి | కడప ప్రభాకరరెడ్డి **(కాంగ్రెస్)** |
| వాయల్పాడు | కిరణ్ కుమార్ రెడ్డి **(కాంగ్రెస్)** |
| పీలేరు | రామచంద్రా రెడ్డి **(కాంగ్రెస్)** |
| చంద్రగిరి | గల్లా అరుణ **(కాంగ్రెస్)** |
| తిరుపతి | వెంకటరమణ **(కాంగ్రెస్)** |
| చిత్తూరు | మనోహర్ **(టి.డి.పి.)** |
| పలమనేరు | టి. లలితాథామస్ **(టి.డి.పి.)** |
| కుప్పం | చంద్రబాబు నాయుడు **(టి.డి.పి.)** |

| నియోజకవర్గం | విజేత |
|---|---|
| పుంగనూరు | అమరనాథ్ రెడ్డి (టి.డి.పి.) |
| మదనపల్లె | దొమ్మాలపాటి రమేష్ (టి.డి.పి.) |

**కడప జిల్లా (11)**

| | |
|---|---|
| కోడూరు | వెంకటేశ్వర ప్రసాద్ (కాంగ్రెస్) |
| రాజంపేట | ప్రభావతమ్మ (కాంగ్రెస్) |
| లక్కిరెడ్డి పల్లి | జి. మోహన్ రెడ్డి (కాంగ్రెస్) |
| కడప | మహమ్మద్ అహ్మదుల్లా (కాంగ్రెస్) |
| బద్వేలు | డి.సి. గోవింద రెడ్డి (కాంగ్రెస్) |
| మైదుకూరు | డి.ఎల్.రవీంద్రారెడ్డి (కాంగ్రెస్) |
| ప్రొద్దుటూరు | వరదరాజుల రెడ్డి (కాంగ్రెస్) |
| జమ్మలమడుగు | ఆదినారాయణ రెడ్డి (కాంగ్రెస్) |
| పులివెందుల | వై.ఎస్. రాజశేఖర్ రెడ్డి (కాంగ్రెస్) |
| రాయచోటి | పాలకొండ రాయుడు (టి.డి.పి.) |
| కమలాపురం | వీర శివారెడ్డి (టి.డి.పి.) |

**అనంతపురం జిల్లా (14)**

| | |
|---|---|
| కదిరి | జొన్నా రామయ్య (కాంగ్రెస్) |
| నల్లమాడ | మోహన్ రెడ్డి (కాంగ్రెస్) |
| గోరంట్ల | పి. రవీంద్రా రెడ్డి (కాంగ్రెస్) |
| మడకశిర | ఎన్. రఘువీరా రెడ్డి (కాంగ్రెస్) |
| గుత్తి | నీలావతి (కాంగ్రెస్) |
| శింగనమల | శైలజానాథ్ (కాంగ్రెస్) |
| అనంతపురం | బి. నారాయణ రెడ్డి (కాంగ్రెస్) |
| తాడిపత్రి | జె.సి. దివాకర్ రెడ్డి (కాంగ్రెస్) |
| హిందూపురం | రంగ నాయకులు (టి.డి.పి.) |
| పెనుకొండ | పరిటాల రవీంద్ర (టి.డి.పి.) |
| కల్యాణ దుర్గం | బి.సి.గోవిందప్ప (టి.డి.పి.) |
| రాయదుర్గం | మెట్టుగోవిందరెడ్డి (టి.డి.పి.) |
| ఉరవకొండ | పయ్యావుల కేశవ్ (టి.డి.పి.) |
| ధర్మ వరం | జయమ్మ (టి.డి.పి.) |

**కర్నూలు జిల్లా (13)**

| | |
|---|---|
| ఆలూరు | మూలింటిమారెప్ప (కాంగ్రెస్) |
| ఆదోని | సాయిప్రసాద్ రెడ్డి (కాంగ్రెస్) |
| ఎమ్మిగనూరు | చెన్నకేశవరెడ్డి (కాంగ్రెస్) |
| కోడుమూరు | శిఖామణి (కాంగ్రెస్) |
| డోన్(ద్రోణాచలం) | కోట్ల సుజాత (కాంగ్రెస్) |
| కోయిలకుంట్ల | చల్లారామకృష్ణారెడ్డి (కాంగ్రెస్) |
| ఆళ్లగడ్డ | గంగుల ప్రతాప్ రెడ్డి (కాంగ్రెస్) |
| పాణ్యం | రాంభూపాల్ రెడ్డి (కాంగ్రెస్) |
| నందికొట్కూరు | గౌరుచరిత (కాంగ్రెస్) |
| నంద్యాల | శిల్పా మోహన్ రెడ్డి (కాంగ్రెస్) |
| ఆత్మకూరు | ఏరాసు ప్రతాప రెడ్డి (కాంగ్రెస్) |
| పత్తికొండ | ఎస్వీసుబ్బా రెడ్డి (టి.డి.పి.) |
| కర్నూలు | ఎం.ఎ. గఫూర్ (సి.పి.ఎం.) |

**మహబూబ్ నగర్ జిల్లా (13)**

| | |
|---|---|
| అచ్చంపేట | వంశీ కృష్ణ (కాంగ్రెస్) |
| కల్వకుర్తి | ఎడమ కృష్ణా రెడ్డి (కాంగ్రెస్) |
| షాద్‌నగర్ | పెంట శంకర్ రావు (కాంగ్రెస్) |
| వనపర్తి | జి. చిన్నా రెడ్డి (కాంగ్రెస్) |
| అమరచింత | స్వర్ణసుధాకర రెడ్డి (కాంగ్రెస్) |
| మక్తల్ | చిట్టెం నర్సిరెడ్డి (కాంగ్రెస్) |
| కొడంగల్ | గురునాథ రెడ్డి (కాంగ్రెస్) |
| నాగర్ కర్నూలు | నాగంజనార్ధన్ రెడ్డి (టి.డి.పి.) |
| జడ్చర్ల | లక్ష్మా రెడ్డి (టి.ఆర్.ఎస్.) |
| గద్వాల | డి.కె. అరుణ (సమాజవాది) |
| మహబూబ్ నగర్ | పులి వీరన్న (ఇండి) |
| కొల్లాపూర్ | జూపల్లి కృష్ణా రావు (ఇండి) |
| ఆలంపూర్ | చల్లా వెంకటరమణారెడ్డి (ఇండి) |

**రంగారెడ్డి జిల్లా (6)**

| | |
|---|---|
| తాండూరు | ఎం. నారాయణ రావు (కాంగ్రెస్) |
| చేవెళ్ల | సబితా ఇంద్రారెడ్డి (కాంగ్రెస్) |
| పరిగి | కె. హరీశ్వర్ రెడ్డి (టి.డి.పి.) |
| మేడ్చల్ | టి. దేవేందర్ గౌడ్ (టి.డి.పి.) |
| వికారాబాద్ | ఏ. చంద్రశేఖర్ (టి.ఆర్.ఎస్.) |
| ఇబ్రహీంపట్నం | ఎం.పి. నరసింహ (సి.పి.ఎం.) |

**హైదరాబాద్ జిల్లా (13)**

| | |
|---|---|
| సనత్ నగర్ | మర్రి శశిధర్ రెడ్డి (కాంగ్రెస్) |
| ఖైరతాబాద్ | పి. జనార్ధన్ రెడ్డి (కాంగ్రెస్) |
| మలక్ పేట | మల్‌రెడ్డి రంగారెడ్డి (కాంగ్రెస్) |
| మహరాజ్ గంజ్ | ముఖేష్ (కాంగ్రెస్) |
| కంటోన్మెంట్ | జి. సాయన్న (టి.డి.పి.) |
| ఆసిఫ్‌నగర్ | డి. నాగేందర్ (టి.డి.పి.) |
| హిమాయత్ నగర్ | జి. కిషన్ రెడ్డి (భాజపా) |
| ముషీరాబాద్ | నాయని నర్సింహా రెడ్డి (టి.ఆర్.ఎస్.) |
| సికింద్రాబాద్ | పద్మా రావు (టి.ఆర్.ఎస్.) |
| కార్వాన్ | అఫ్సర్ ఖాన్ (ఎం.ఐ.ఎం.) |
| యాకుత్‌పుర | ముంతాజ్ ఖాన్ (ఎం.ఐ.ఎం.) |
| చాంద్రాయణగుట్ట | అక్బరుద్దీన్ ఒవైసీ (ఎం.ఐ.ఎం.) |
| చార్మినార్ | అహ్మద్‌పాషాఖాద్రి (ఎం.ఐ.ఎం.) |

**మెదక్ జిల్లా (10)**

| | |
|---|---|
| గజ్వేల్ | గీతా రెడ్డి (కాంగ్రెస్) |
| నర్సాపూర్ | సునీతా రెడ్డి (కాంగ్రెస్) |
| జహీరాబాద్ | ఫరీదుద్దీన్ (కాంగ్రెస్) |
| నారాయణఖేడ్ | సురేష్ షెట్కర్ (కాంగ్రెస్) |
| ఆందోలు | దామోదర్ రాజ నరసింహ (కాంగ్రెస్) |
| సిద్దిపేట | కె. చంద్రశేఖర రావు (టి.ఆర్.ఎస్.) |
| దొమ్మాట | ఎస్. రామలింగా రెడ్డి (టి.ఆర్.ఎస్.) |
| సంగారెడ్డి | జయప్రకాశ్ రెడ్డి (టి.ఆర్.ఎస్.) |
| రామాయంపేట | ఎం. పద్మ (టి.ఆర్.ఎస్.) |
| మెదక్ | శశిధర్ రెడ్డి (జనతా పార్టీ) |

**నిజామాబాద్ జిల్లా (9)**

| | |
|---|---|
| బాల్కొండ | కె.ఆర్. సురేశ్ రెడ్డి (కాంగ్రెస్) |
| కామారెడ్డి | షబ్బీర్ ఆలీ (కాంగ్రెస్) |
| జుక్కల్ | ఎస్. గంగారాం (కాంగ్రెస్) |
| బాన్సువాడ | గోవర్ధన్ (కాంగ్రెస్) |
| బోధన్ | కె. సుదర్శన్ రెడ్డి (కాంగ్రెస్) |
| నిజామాబాద్ | డి. శ్రీనివాస్ (కాంగ్రెస్) |
| ఆర్మూరు | సంతోష్ రెడ్డి (టి.ఆర్.ఎస్.) |
| ఎల్లా రెడ్డి | రవీంద్ర రెడ్డి (టి.ఆర్.ఎస్.) |
| డిచ్‌పల్లి | గంగా రెడ్డి (టి.ఆర్.ఎస్.) |

**ఆదిలాబాద్ జిల్లా (9)**

| | |
|---|---|
| నిర్మల్ | ఇంద్రకరణ్ రెడ్డి (కాంగ్రెస్) |
| ఆదిలాబాద్ | సి. రామచంద్రా రెడ్డి (కాంగ్రెస్) |
| సిర్పూర్ | కోనేరు కోనప్ప (కాంగ్రెస్) |
| లక్సెట్టి పేట | దివాకర్ బాబు (కాంగ్రెస్) |
| చెన్నూరు | జి. వినోద్ (కాంగ్రెస్) |
| ఆసిఫాబాద్ | శ్రీదేవి (టి.డి.పి.) |
| ముధోల్ | నారాయణరావ్ పటేల్ (టి.ఆర్.ఎస్.) |

| | |
|---|---|
| బోథ్ | సోయం బాబురావ్ (టి.ఆర్.ఎస్.) |
| ఖానాపూర్ | గోవింద్ నాయక్ (టి.ఆర్.ఎస్.) |
| **కరీంనగర్ జిల్లా (13)** | |
| మంథని | డి. శ్రీధర్ బాబు (కాంగ్రెస్) |
| కరీంనగర్ | ఎం.సత్యనారాయణ రావు (కాంగ్రెస్) |
| జగిత్యాల | టి. జీవన్ రెడ్డి (కాంగ్రెస్) |
| బుగ్గారం | జువ్వాది రత్నాకర్ రావు (కాంగ్రెస్) |
| చొప్పదండి | సానామారుతి (టి.డి.పి.) |
| సిరిసిల్ల | సిహెచ్. రాజేశ్వర రావు (టి.డి.పి.) |
| పెద్దపల్లి | జి. ముకుంద రెడ్డి (టి.ఆర్.ఎస్.) |
| మేడారం | కొప్పుల ఈశ్వర్ (టి.ఆర్.ఎస్.) |
| హుజూరాబాద్ | లక్ష్మీకాంత రావు (టి.ఆర్.ఎస్.) |
| కమలాపూర్ | రాజేందర్ (టి.ఆర్.ఎస్.) |
| నేరెళ్ల | లింగయ్య (టి.ఆర్.ఎస్.) |
| ఇందుర్తి | చాడ వెంకట రెడ్డి (సి.పి.ఐ.) |
| మెట్‌పల్లి | కొమ్మిరెడ్డి రాములు (జనతా పార్టీ) |
| **వరంగల్ జిల్లా (13)** | |
| జనగామ | పొన్నాల లక్ష్మయ్య (కాంగ్రెస్) |
| డోర్నకల్ | రెడ్యానాయక్ (కాంగ్రెస్) |
| వరంగల్ | బస్వరాజు సారయ్య (కాంగ్రెస్) |
| శాయం పేట | కొండా సురేఖ (కాంగ్రెస్) |
| ములుగు | పోడెం వీరయ్య (కాంగ్రెస్) |
| మహబూబాబాద్ (మానుకోట) | వి. నరేందర్ రెడ్డి (టి.డి.పి.) |
| వర్ధన్న పేట | దయాకర్ రావు (టి.డి.పి.) |
| చేర్యాల | ప్రతాపరెడ్డి (టి.ఆర్.ఎస్.) |
| చెన్నూరు | డి. శ్రీనివాసరావు (టి.ఆర్.ఎస్.) |
| నర్సంపేట | కె. లక్ష్మా రెడ్డి (టి.ఆర్.ఎస్.) |
| ఘన్‌పూర్ | వి. విజయరామారావు (టి.ఆర్.ఎస్.) |
| హనుమకొండ | ఎం. సత్యనారాయణ రెడ్డి (టి.ఆర్.ఎస్.) |
| పరకాల | బండారు శారారాణి (టి.ఆర్.ఎస్.) |
| **ఖమ్మం జిల్లా (9)** | |
| కొత్తగూడెం | వనమా వెంకటేశ్వర రావు (కాంగ్రెస్) |
| సత్తుపల్లి | జలగం వెంకట్రావు (కాంగ్రెస్) |
| పాలేరు | సంభాని చంద్రశేఖర్ (కాంగ్రెస్) |
| సుజాత నగర్ | ఆర్. వెంకట్ రెడ్డి (కాంగ్రెస్) |
| భద్రాచలం | సున్నం రాజయ్య (సి.పి.ఎం.) |
| మధిర | కట్టా వెంకటనరసయ్య (సి.పి.ఎం.) |
| ఖమ్మం | తమ్మినేని వీరభద్రం (సి.పి.ఎం.) |
| బూర్గంపాడ్ | పాయం వెంకటేశ్వర్లు (సి.పి.ఐ.) |
| ఇల్లెందు | గుమ్మడి నర్సయ్య (న్యూ డెమోక్రసీ) |
| **నల్లగొండ జిల్లా (12)** | |
| తుంగతుర్తి | ఆర్. దామోదర్ రెడ్డి (కాంగ్రెస్) |
| సూర్యాపేట | వెంకయ్య (కాంగ్రెస్) |
| కోదాడ | ఉత్తమ్ కుమార్ రెడ్డి (కాంగ్రెస్) |
| చలకుర్తి | కె. జానా రెడ్డి (కాంగ్రెస్) |
| నల్లగొండ | కోమటి రెడ్డి వెంకటరెడ్డి (కాంగ్రెస్) |
| రామన్న పేట | వి. పురుషోత్తం రెడ్డి (కాంగ్రెస్) |
| భువనగిరి | ఉమా మాధవ రెడ్డి (టి.డి.పి.) |
| ఆలేరు | కె. నగేశ్ (టి.ఆర్.ఎస్.) |
| మిర్యాలగూడ | జూలకంటి రంగారెడ్డి (సి.పి.ఎం.) |
| నకిరేకల్ | నోముల నర్సింహయ్య (సి.పి.ఎం.) |
| మునుగోడు | పల్లా వెంకట రెడ్డి (సి.పి.ఐ.) |
| దేవరకొండ | ఆర్. రవీంద్ర కుమార్ (సి.పి.ఐ.) |

## 14వ లోకసభకు రాష్ట్రం నుండి ఎన్నికైన వారు

| | | | |
|---|---|---|---|
| 1. | శ్రీకాకుళం | కె. ఎర్రన్నాయుడు | తెలుగు దేశం |
| 2. | పార్వతీ పురం | సూర్యనారాయణ దేవ్ | కాంగ్రెస్ |
| 3. | బొబ్బిలి | కె. పైడితల్లి నాయుడు | తెలుగుదేశం |
| 4. | విశాఖపట్నం | ఎన్. జనార్ధన్ రెడ్డి | కాంగ్రెస్ |
| 5. | భద్రాచలం | ఎం. బాబూ రావు | సి.పి.ఎం. |
| 6. | అనకా పల్లి | పి. చలపతి రావు | తెలుగు దేశం |
| 7. | కాకినాడ | ఎం. పల్లం రాజు | కాంగ్రెస్ |
| 8. | రాజమండ్రి | యు. అరుణ కుమార్ | కాంగ్రెస్ |
| 9. | అమలాపురం | హర్ష కుమార్ | కాంగ్రెస్ |
| 10. | నరసాపురం | సిహెచ్. హరిరామ జోగయ్య | కాంగ్రెస్ |
| 11. | ఏలూరు | కె. సాంబ శివరావు | కాంగ్రెస్ |
| 12. | మచిలీపట్నం | బి. రామకృష్ణ | కాంగ్రెస్ |
| 13. | విజయవాడ | ఎల్. రాజగోపాల్ | కాంగ్రెస్ |
| 14. | తెనాలి | వి. బాలశౌరి | కాంగ్రెస్ |
| 15. | గుంటూరు | ఆర్. సాంబశివరావు | కాంగ్రెస్ |
| 16. | బాపట్ల | డి. పురంధరేశ్వరి | కాంగ్రెస్ |
| 17. | నరసరావు పేట | ఎం. రాజమోహన్ రెడ్డి | కాంగ్రెస్ |
| 18. | ఒంగోలు | ఎం. శ్రీనివాసుల రెడ్డి | కాంగ్రెస్ |
| 19. | నెల్లూరు | పనబాక లక్ష్మి | కాంగ్రెస్ |
| 20. | తిరుపతి | చింతామోహన్ | కాంగ్రెస్ |
| 21. | చిత్తూరు | డి.కె. ఆదికేశవులు | తెలుగుదేశం |
| 22. | రాజంపేట | ఎ. సాయి ప్రతాప్ | కాంగ్రెస్ |
| 23. | కడప | వై.ఎస్. వివేకానంద రెడ్డి | కాంగ్రెస్ |
| 24. | హిందూ పురం | నిజాముద్దీన్ | కాంగ్రెస్ |
| 25. | అనంతపురం | ఎ. వెంకట్రామి రెడ్డి | కాంగ్రెస్ |
| 26. | కర్నూలు | కోట్ల సూర్య ప్రకాశ్ రెడ్డి | కాంగ్రెస్ |
| 27. | నంద్యాల | ఎస్.పి.వై. రెడ్డి | కాంగ్రెస్ |
| 28. | నాగర్ కర్నూలు | మంద జగన్నాథం | తెలుగు దేశం |
| 29. | మహబూబ్ నగర్ | డి. విఠల్ రావు | కాంగ్రెస్ |
| 30. | హైదరాబాద్ | అసదుద్దీన్ ఓవైసీ | ఎం.ఐ.ఎం. |
| 31. | సికింద్రాబాద్ | అంజన్‌కుమార్ యాదవ్ | కాంగ్రెస్ |
| 32. | సిద్దిపేట | ఎస్. సత్యనారాయణ | కాంగ్రెస్ |
| 33. | మెదక్ | ఎ. నరేంద్ర | తెరాస |
| 34. | నిజామాబాద్ | మధుయాస్కిగౌడ్ | కాంగ్రెస్ |
| 35. | ఆదిలాబాద్ | మధుసూదన్ రెడ్డి | తెరాస |
| 36. | పెద్దపల్లి | జి. వెంకటస్వామి | కాంగ్రెస్ |
| 37. | కరీంనగర్ | కె. చంద్రశేఖర రావు | తెరాస |
| 38. | హన్మకొండ | బి. వినోద్ కుమార్ | తెరాస |
| 39. | వరంగల్ | రవీంద్రనాయక్ | తెరాస |
| 40. | ఖమ్మం | రేణుకా చౌదరి | కాంగ్రెస్ |
| 41. | నల్గొండ | ఎస్. సుధాకర రెడ్డి | సి.పి.ఐ. |
| 42. | మిరియాల గూడెం | ఎస్. జైపాల్ రెడ్డి | కాంగ్రెస్ |

## 14వ లోక్ సభలో వివిధ పార్టీల బలాబలాలు

### ఐక్య ప్రగతిశీల కూటమి (యు.పి.ఎ.)

**కాంగ్రెస్ మిత్ర పక్షాలు -219**

| | | |
|---|---|---|
| 1. | కాంగ్రెస్ | 145 |
| 2. | రాష్ట్రీయ జనతాదల్ | 21 |
| 3. | డి.ఎం.కె. | 16 |
| 4. | నేషనలిస్ట్ కాంగ్రెస్ | 9 |
| 5. | పి.ఎం.కె. | 6 |
| 6. | జార్ఖండ్ ముక్తిమోర్చ | 5 |
| 7. | తెలంగాణా రాష్ట్ర సమితి | 5 |
| 8. | లోక్ జనశక్తి | 4 |
| 9. | ఎం.డి.ఎం.కె. | 4 |
| 10. | పీపుల్స్ డెమోక్రటిక్ పార్టీ | 1 |
| 11. | ముస్లిం లీగ్ | 1 |
| 12. | రిపబ్లికన్ పార్టీ ఆఫ్ ఇండియా (అత్వాలే) | 1 |
| 13. | స్వతంత్రులు (ఇండియన్ నేషనల్ కాంగ్రెస్) | 1 |
| | | 219 |

**వామపక్షాలు-61**

| | | |
|---|---|---|
| 1. | సి.పి.ఐ.(ఎం.) | 43 |
| 2. | సి.పి.ఐ. | 10 |
| 3. | ఫార్వర్డ్ బ్లాక్ | 3 |
| 4. | ఆర్.ఎస్.పి. | 3 |
| 5. | కేరళ కాంగ్రెస్ | 1 |
| 6. | స్వతంత్రులు (సి.పి.ఐ.(ఎం.) | 1 |
| | | 61 |

**జాతీయ ప్రజాతంత్ర కూటమి (ఎన్.డి.ఎ.)- 189**

| | | |
|---|---|---|
| 1. | బిజెపి | 138 |
| 2. | శివసేన | 12 |
| 3. | బిజూ జనతాదళ్ | 11 |
| 4. | జనతాదళ్ (ఐక్య) | 8 |
| 5. | అకాలీదళ్ (బాదల్) | 8 |
| 6. | తెలుగుదేశం | 5 |
| 7. | తృణమూల్ కాంగ్రెస్ | 2 |
| 8. | మిజోనేషనల్ ఫ్రంట్ | 1 |
| 9. | సిక్కిం డెమోక్రటిక్ ఫ్రంట్ | 1 |
| 10. | ఐ.ఎఫ్.డి.పి. (కేరళ) | 1 |
| 11. | నాగాలాండ్ పీపుల్స్ ఫ్రంట్ | 1 |
| 12. | స్వతంత్రులు | 1 |
| | | 189 |

**ఇతరులు-70**

| | | |
|---|---|---|
| 1. | సమాజవాదీ పార్టీ | 36 |
| 2. | బహుజన సమాజ పార్టీ | 19 |
| 3. | రాష్ట్రీయ లోక్ దళ్ | 3 |
| 4. | జనతాదళ్ (లౌకిక) | 3 |
| 5. | అస్సాంగణ పరిషత్ | 2 |
| 6. | సమాజవాదీ జనతాపార్టీ | 1 |
| 7. | నేషనల్ కాన్ఫరెన్స్ | 2 |
| 8. | స్వతంత్రులు | 1 |
| 9. | నాగాలాండ్ లేబర్ పార్టీ | 1 |
| 10. | మజ్లీస్ | 1 |
| 11. | ఇతరులు | 1 |
| | | 70 |

# ఆంధ్ర ప్రదేశ్ మంత్రులు - శాఖలు

**డాక్టర్ వై.ఎస్. రాజశేఖర్ రెడ్డి (కడప):** సాధారణ పరిపాలన శాఖ, శాంతి భద్రతలు, మంత్రులకు కేటాయించని ఇతర శాఖలు

**కొణిజేటి రోశయ్య (ప్రకాశం):** ఆర్థిక, శాసనసభా వ్యవహారాలు, ప్రణాళిక, చిన్న మొత్తాల పొదుపు, లాటరీలు.

**మహ్మద్ అలీషబ్బీర్ (నిజామాబాద్):** సమాచార, పౌరసంబంధాలు

**జె.సి. దివాకర్ రెడ్డి (అనంతపురం):** పంచాయతీరాజ్

**డాక్టర్ జె. గీతారెడ్డి (మెదక్):** పర్యాటక, చక్కెర

**కుందూరు జానారెడ్డి (నల్లగొండ):** హోం, జైళ్లు, ఫైర్ సర్వీసులు, సైనిక సంక్షేమం

**పొన్నాల లక్ష్మయ్య (వరంగల్):** భారీ నీటిపారుదల

**ధర్మాన ప్రసాదరావు (శ్రీకాకుళం):** రెవిన్యూ, సహాయ, పునరావాసం.

**ఎన్. రఘువీరారెడ్డి (అనంతపురం):** వ్యవసాయం.

**డి. రెడ్యానాయక్ (వరంగల్):** సాంఘిక సంక్షేమం

**డి. శ్రీనివాస్ (నిజామాబాద్):** గ్రామీణాభివృద్ధి, గ్రామీణ నీటిపారుదల, ఉపాధి

**కోనేరు రంగారావు (కృష్ణా):** పురపాలక, పట్టణాభివృద్ధి.

**మహ్మద్ ఫరీదుద్దీన్ (మెదక్):** మైనారిటీల సంక్షేమం, వక్ఫ్, ఉర్దూ, ఫిషరీస్

**మూలింటి మారెప్ప (కర్నూలు):** ఎత్తిపోతల పథకాలు, ఎపిఐడిసి, భూగర్భ జలాల అభివృద్ధి, రెయిన్ షాడో ప్రాంతాల అభివృద్ధి.

**నేదురుమల్లి రాజ్యలక్ష్మి (నెల్లూరు):** పాఠశాల, వయోజన విద్య, గ్రంథాలయాలు, పురావస్తు

**కొణతాల రామకృష్ణ (విశాఖపట్నం):** వాణిజ్య పన్నులు

**జక్కంపూడి రామ్మోహనరావు (తూ.గోదావరి):** రహదారులు, భవనాల శాఖ

**సబితా ఇంద్రారెడ్డి (రంగారెడ్డి):** గనులు

**బొత్స సత్యనారాయణ (విజయనగరం):** భారీ పరిశ్రమలు, వాణిజ్యం, ఎగుమతుల ప్రోత్సాహకం.

**ఎం. సత్యనారాయణ రావ్ (కరీంనగర్):** దేవాదాయ శాఖ

**గొల్లపల్లి సూర్యారావు (తూ. గోదావరి):** పశుసంవర్థక, పాడి పరిశ్రమాభివృద్ధి

**పిన్నమనేని వెంకటేశ్వర రావు (కృష్ణా):** ఉన్నత విద్య

**శత్రుచర్ల విజయరామరాజు (విజయనగరం):** అడవులు, పర్యావరణం, శాస్త్రసాంకేతిక, పరిజ్ఞానం.

**జి.వినోద్ (ఆదిలాబాద్):** కార్మిక, ఉపాధి

# కేంద్ర మంత్రులు - శాఖలు

| | |
|---|---|
| మన్మోహన్ సింగ్ | ప్రధానమంత్రి |
| శివరాజ్ పాటిల్ | హోంశాఖ |
| ప్రణబ్ ముఖర్జీ | రక్షణ శాఖ |
| అర్జున్ సింగ్ | మానవ వనరుల అభివృద్ధి శాఖ |
| నట్వర్ సింగ్ | విదేశీ వ్యవహారాలు |
| పి. చిదంబరం | ఆర్థిక శాఖ |
| గులాంనబీ ఆజాద్ | పార్లమెంటరీ వ్యవహారాలు, పట్టణాభివృద్ధి |
| కమల్ నాథ్ | వాణిజ్య, పరిశ్రమల శాఖ |
| ఎస్. జైపాల్ రెడ్డి | సమాచార, ప్రసార శాఖ |
| శరద్ పవార్ | ఆహార, వ్యవసాయ, పౌరసరఫరాలు |
| లాలూ ప్రసాద్ యాదవ్ | రైల్వే శాఖ |
| భరద్వాజ్ | న్యాయశాఖ |
| పి.ఎం. సయీద్ | విద్యుత్ శాఖ |
| ఎ. రాందాస్ | ఆరోగ్య, కుటుంబ సంక్షేమశాఖ |
| రాంవిలాస్ పాశ్వాన్ | ఉక్కు, ఎరువులు, రసాయనాలు |
| శిబూ సోరేన్ | బొగ్గు, గనులు, ఖనిజాభివృద్ధి |
| కపిల్ సిబల్ | శాస్త్ర సాంకేతిక, సముద్ర అభివృద్ధి |
| ప్రఫుల్ పటేల్ | పౌరవిమానయాన శాఖ |
| దయానిధి మారన్ | కమ్యూనికేషన్, ఐటి శాఖ |
| రఘువంశ ప్రసాద్ సింగ్ | గ్రామీణాభివృద్ధి శాఖ |
| టి.ఆర్. బాలు | ఉపరితల రవాణా శాఖ, షిప్పింగ్ (అదనం), జాతీయ రహదారులు |
| ఎ. రాజా | అడవులు, పర్యావరణ శాఖ |
| మణిశంకర్ అయ్యర్ | పెట్రోలియం, సహజవాయువులు, పంచాయతీరాజ్ శాఖ |
| మహవీర్ ప్రసాద్ | లఘు పరిశ్రమలు, వ్యవసాయ, గ్రామీణ పరిశ్రమలు |
| పి.ఆర్. కిండియా | గిరిజన వ్యవహారాలు, ఈశాన్య ప్రాంత అభివృద్ధి శాఖ |
| శంకర్ సింగ్ వాఘేలా | జౌళి శాఖ |
| ప్రియరంజన్ దాస్ | జలవనరుల శాఖ |
| సునీల్ దత్ | క్రీడలు, యువజన వ్యవహారాలు |
| మీరా కుమార్ | సామాజిక న్యాయం, సాధికారత |
| కె. చంద్రశేఖర రావు | ఏ శాఖ లేదు. (షిప్పింగ్ వదులుకున్నారు) |
| శీష్‌రాం ఓలా | కార్మిక, ఉపాధి కల్పనాశాఖ |

### సహాయ మంత్రులు (ఇండిపెండెంట్ ఛార్జ్)

| | |
|---|---|
| సంతోష్ మోహన్‌దేవ్ | భారీపరిశ్రమలు, ప్రభుత్వరంగ సంస్థలు |
| జగదీశ్ టైట్లర్ | ప్రవాస భారతీయుల వ్యవహారాలు |
| ఆస్కార్ ఫెర్నాండెజ్ | కార్యక్రమాల అమలు, గణాంక శాఖ |
| రేణుకా చౌదరి | పర్యాటక శాఖ |
| సుబోధ్ కాంత్ సహాయ్ | ఫుడ్ ప్రాసెసింగ్ |
| ప్రేమ్‌చంద్ గుప్తా | కంపెనీ వ్యవహారాలు |
| విలాస్ ముత్తెంవార్ | సంప్రదాయేతర ఇంధనవనరులు |
| కుమారి సెల్జా | పట్టణ ఉపాధికల్పన, దారిద్ర్య నిర్మూలన |

### సహాయ మంత్రులు - శాఖలు

| | |
|---|---|
| ఇ. అహ్మద్ | విదేశీ వ్యవహారాలు |
| సురేశ్ పచౌరి | సిబ్బంది, పార్లమెంటరీ వ్యవహారాలు |
| బి.కె. హాండిక్ | రక్షణ, పార్లమెంటరీ వ్యవహారాలు |
| పనబాక లక్ష్మి | ఆరోగ్యం, కుటుంబ సంక్షేమం |

| | |
|---|---|
| దాసరి నారాయణ రావు | బొగ్గు, గనుల శాఖ |
| షకీల్ అహ్మద్ | కమ్యూనికేషన్లు, ఐటి |
| రావ్ ఇంద్రజిత్ సింగ్ | విదేశీ వ్యవహారాలు |
| రత్వా | రైల్వేలు |
| రహమాన్ ఖాన్ | రసాయనాలు, ఎరువులు |
| కెహెచ్. మునియప్ప | ఉపరితల రవాణా, జాతీయ రహదారులు |
| ఎం.వి. రాజశేఖరన్ | ప్రణాళిక శాఖ |
| కాంతిలాల్ భూరియా | వ్యవసాయం, ఆహార, పౌరసరఫరాలు |
| మాణిక్‌రావు గావిట్ | హోంశాఖ |
| శ్రీప్రకాశ్ జైపాల్ | హోంశాఖ |
| పృధ్వీరాజ్ చౌహాన్ | ప్రధాని కార్యాలయం వ్యవహారాలు |
| తస్లీముద్దీన్ | వ్యవయసాయం, ఆహారం, పౌరసరఫరాలు<br>వినియోగదారుల వ్యవహారాలు |
| సూర్యకాంత్ పాటిల్ | గ్రామీణాభివృద్ధి శాఖ, పార్లమెంటరీ వ్యవహారాలు |
| మహ్మద్ అలీ అష్రాఫ్ ఫాత్మి | మానవ వనరుల అభివృద్ధి శాఖ |
| ఎ. నరేంద్ర | గ్రామీణాభివృద్ధి శాఖ |
| ఆర్. వేలు | రైల్వేలు |
| పళనిమాణిక్యం | ఆర్థికం (రెవిన్యూ) |
| ఎస్. రఘుపతి | హోంశాఖ |
| కె. వెంకటపతి | న్యాయశాఖ |
| ఎస్. జగదీశన్ | సామాజిక న్యాయ శాఖ |
| ఇ.వి.కె. ఇలంగోవన్ | పరిశ్రమలు, వాణిజ్యం |
| కాంతిసింగ్ | మానవ వనరుల అభివృద్ధి శాఖ |
| నమోనారాయణ్ | అడవులు, పర్యావరణ శాఖ |
| జైప్రకాశ్ నారాయణ్ | జలవనరుల శాఖ |
| అఖిలేశ్ సింగ్ | వ్యవసాయం, ఆహార, పౌరసరఫరాలు |





| క్రమ సంఖ్య | విలువ | నెలలు | నెలకు కట్టవలసిన రూ॥ | డ్రా కాలంలో చెల్లించవలసిన సోమ్ము | ప్రైజ్ మొత్తం |
|---|---|---|---|---|---|
| 1. | 200000 | 40 | 5000 | 3250 | 1,20,000 |
| 2. | 100000 | 40 | 2500 | 1625 | 60,000 |
| 3. | 100000 | 25 | 4000 | 2800 | 65,000 |
| 4. | 50,000 | 40 | 1250 | 812.50 | 30,000 |
| 5. | 50,000 | 25 | 2000 | 1400 | 32500 |
| 6. | 99000 | 33 | 3000 | Open Action | - |

# ప్రజాప్రతినిధుల్లారా! మా ఆశలు నెరవేర్చండి

- జి.సి.మధుసూదన రావు

"అత్యున్నత శాసనాధికారం గల సంస్థను బోట్‌క్లబ్ స్థాయికి దిగజార్చారు"– సంగ్మా!

"ప్రజలు గమనిస్తున్నారు. హుందాగా ప్రవర్తించండి. ప్రజా ప్రతినిధులమని మరవకండి"– బాలయోగి.

"ప్రజాధనం వృథా అవుతుంది. ప్రజా కాంక్షలు మరుగున పడిపోతాయి. ప్రజలు క్షమించరు"– శివరాజ్ పాటిల్.

ఈ మాటలు అన్నది చదువు సంధ్యలు లేని వారిని ఉద్దేశించి కాదు, లక్షలాది ప్రజల ఆకాంక్షలకు ప్రతినిధులమని చెప్పుకునే పార్లమెంట్ సభ్యుల సభలోని ప్రవర్తనపట్ల విసుగు చెంది స్పీకర్లు ఆందోళనతో వ్యక్తం చేసిన అభిప్రాయాలవి. అందరూ సభను బోట్‌క్లబ్ స్థాయికి దిగజార్చారా! అంటే కాదు. కొద్దిమంది తమ అహాన్ని సంతృప్తి పరచుకోవడానికి, మరి కొద్దిమంది తమ మాటే చెల్లాలనే భావంతో లోకసభ, రాజ్యసభ కార్యక్రమాలకు అంతరాయం కల్గిస్తున్నారు. పెద్దల బాటలోనే **పిల్లలు అనే రీతిలో** వివిధ **రాష్ట్రాలలోని శాసనసభలు** కూడా కట్టు తప్పి శాసక కర్తల దురావేశ ప్రదర్శన శాలలుగా దిగజారిపోతున్నాయి. ఇదేం ప్రవర్తన అని అడిగే స్పీకర్‌పై దాడులు చోటుచేసుకుంటున్నాయి. దాంతో పార్లమెంట్ కార్యక్రమాలంటే ఆసక్తి ప్రజల్లో లోపిస్తున్నది. వీళ్ళేనా! ఇందుకోసమేనా మేము ఎన్నుకొన్నది?–అంటూ ప్రజలు ఈసడించుకొంటున్నారు. ఈ ఈసడింపులు ఎక్కువైతే ప్రజాస్వామ్య వ్యవస్థకే ప్రమాదం. (అందుకే నూతనంగా నేడు దేశంలోనూ (లోక్‌సభ), రాష్ట్రంలోనూ ప్రజల నుంచి ఎన్నికైన ప్రజా ప్రతినిధులు ప్రజా ప్రతినిధుల్లా ప్రజా సమస్యలను తమ సభల్లో వినిపించాలని ఆశిస్తూ ఈ వ్యాసం.)........

**క్రమ శిక్షణా రాహిత్యానికి కారణాలు**

చట్ట సభల్లో సభ్యులు అదుపు తప్పి ప్రవర్తించేందుకు కారణభూతమవుతున్న కొన్ని అంశాలు. వివిధ అంశాలను లేవనెత్తేందుకు తగిన సమయం లభించకపోవడం. తాము లేవనెత్తిన అంశాలకే ప్రభుత్వం తగిన విధంగా స్పందించక పోవడం. అధికార సభ్యులు ప్రతీకార ధోరణితో వ్యవహరించడం. కొద్దిమంది తమ అహాన్ని సంతృప్తి పరచుకోవడానికి అంతరాయం కల్గిస్తే, సభ నియమ నిబంధనలకు కట్టుబడాలన్న విచక్షణ కొద్ది మంది ప్రజా ప్రతినిధుల్లో లోపించడం; కొన్ని రాజకీయ పార్టీలు, నాయకులు రాజకీయ వివాదాలకు చట్ట సభలను వేదికగా మార్చుకోవడానికి ప్రయత్నించడం, సమస్యలను ప్రస్తావించి గందర గోళం సృష్టించి రాజకీయ లబ్దిపొందడం పైనే దృష్టి నిలపడం, సమస్యను లేన నెత్తడమే తమ పనిగా, దానిని పరిష్కరించడంలో ప్రభుత్వానికి సహకరించాల్సిన బాధ్యత తమకు లేనట్లుగా ప్రవర్తిస్తున్నాయి. అధికార పక్షం ప్రతిపక్షాలను **విశ్వాసంలోకి తీసుకోకపోవడం,** ప్రతిపక్షాలు చేసే విమర్శలోని మంచిని గ్రహించే ఓపిక అధికార పక్ష సభ్యుల్లో లోపించడం లాంటివని చెప్పవచ్చు. ఒక్కమాటలో చెప్పాలంటే రాజకీయ లబ్దికోసం అధికార– ప్రతిపక్షాలలోని కొందరు అనుసరిస్తున్న ధోరణుల మధ్య సభా కార్యాక్రమాలకు తీవ్ర అంతరాయం కల్గుతున్నది. ప్రజా– సమస్యలు మరుగున పడిపోతున్నాయి. లక్షలాది రూపాయల ప్రజాధనం వృథా అవుతున్నది. ఇలా సభల్లో అంతరాయం ప్రతిదేశ సభల్లో వుందా? దీన్ని నివారించలేమా అంటే నివారించే వీలుంది. అది ఎలా గంటే....

**ప్రవర్తనా నియమావళి**

చట్ట సభల పట్ల ప్రజలకు నమ్మకం సడల కుండా వుండేందుకు పలు దేశాల్లో అనేక చర్యలు చేపడుతున్నారు. చట్ట సభల్లో పాటించాల్సిన ప్రమాణాలు, సభ్యుల రుజువర్తన మీద అమెరికా సెనెట్ 1964లో సెలెక్ట కమిటీని నియమించింది. ఎం.పి.ల ఆర్థిక లావాదేవీలను రిజిష్టర్‌లో తప్పనిసరిగా నమోదు చేయాలని 1974లో బ్రిటన్‌లు నిర్ణయించారు. ఇలా ప్రతి దేశంలోను సభగొప్పతనాన్ని, పని దినాలను పెంచడానికి వారు చర్యలు తీసుకున్నారు. మనం మాత్రం ఎం.పి.లకు, శాసన సభ్యులకు వర్తించేలా చట్ట బద్ధమైన సమగ్ర ప్రవర్తన నియమావళిని ఇంతవరకు రూపొందించు కోలేకపోయాం. చివరకు 1992లో స్పీకర్ శివరాజ్ కృషివల్ల ఎం.పి.లకు ప్రవర్తన నియమావళిని తయారుచేశారు. దీనిపైన ప్రిసైడింగ్ అధికారులు సమావేశమై చర్చించారు. ఆ తర్వాత స్పీకర్ జి.ఎం.సి. బాలయోగి చొరవతో మరో సమావేశం నిర్వహించారు. ప్రవర్తనా నియమావళి రూపొందించారు.

**ప్రవర్తనా నియమావళిలో ప్రధానాంశాలు**

ప్రజా ప్రతినిధుల ప్రవర్తనా నియమావళిలోని 60 అంశాలలో సభలోను, వెలుపలా సభ్యులకు వర్తించేవి వున్నాయి. సమావేశాల కాలవ్యవధిని పెంచాలని, ప్రతి సం॥ పార్లమెంట్ కనీసం 120 రోజులు, రాష్ట్రాల అసెంబ్లీలు 100 రోజులు, చిన్న రాష్ట్రాల అసెంబ్లీలు 60 రోజులు సమావేశమవ్వాలని నిర్ణయించారు. ప్రశ్నోత్తరాల సమయానికి అటంకం కల్గించరాదని, వెల్‌లోకి దూసుకుపోరాదని, సభ్యులు మాట్లాడుతున్నప్పుడు అవరోధం కల్గించరాదని, సభలో నినాదాలు, సభల్లోనూ, పరిసర ప్రాంతాలలోనూ సత్యాగ్రహాలు, ధర్నాలు చేయరాదని, స్పీకర్ అనుమతి లేకుండా మాట్లాడరాదని, సభలో నిరసన వ్యక్తం చేస్తూ ఎటువంటివి చింపరాదని, కోర్టుల్లో పెండింగ్‌లో వున్న ఏ అంశాన్ని సభలో ప్రస్తావించరాదని, స్పీకర్ రూలింగ్‌ని ప్రశ్నించడం, దానిపై వాఖ్యానించడం చేయరాదని ఇలా పలు వాటిపై నిర్ణయాలు తీసుకున్నారు. సభ హుందా తనాన్ని గౌరవాన్ని పరిరక్షించడంలో అధికార, ప్రతిపక్షాలు స్పీకర్‌కు సహకరించాలని, ప్రతిక్షాల పట్ల అధికార పక్షం మరింత సానుకూలమైన, సర్దుబాటు వైఖరిని అనుసరించాలని పాలక పక్షాలకు సూచించింది. ఇందుకుగానూ రాజ్యాంగాన్ని సవరించాలని బాలయోగి సదస్సు సూచించింది. ఇలా "ప్రవర్తన నియమావళి" ప్రకటించిన మరునాడే సభ్యులు చాలా మంది దాన్ని ఉల్లంఘించి సభా మధ్యం (వెల్)లోకి దూసుకెళ్ళి కార్గిల్ విషయమై గందరగోళం సృష్టించారు. ప్రవర్తనా నియమావళి ప్రకారం "వెల్"లోకి వచ్చిన వారిని అనర్హులుగా ప్రకటించవచ్చు. కాని సభ్యులు మూకుమ్మడిగా రావడంతో స్పీకర్ నిస్సహాయులై సభను వాయిదా వేశారు. నిజానికి కార్గిల్‌పై "కాగ్" నివేదికను అందేవరకు వేచి ఉండలేక పోవడం విచారకరం.

**"పిల్లల్ని చూసి నేర్వండి"**

విద్యార్థుల్లో నాయకత్వ లక్షణాలను పెంపొందించడానికి వ్యక్తిత్వాన్ని తీర్చి దిద్దడానికి చట్ట సభల పట్ల అవగాహన కల్పించడానికి పలు పాఠశాలల్లో విద్యార్థులచే "నమూనా పార్లమెంట్" నిర్వహిస్తున్నారు. దేశ వ్యాప్తంగా కేంద్రీయ విద్యాలయాల విద్యార్థులు "నమూనా పార్లమెంట్" కార్యక్రమాలను కొనసాగిస్తున్నారు. సభ్యులుగా వారు నియమ నిబంధలను పాటించే తీరు ప్రశంసలందుకొంటోంది. పిల్లల నమూనా పార్లమెంట్ల ద్వారా ఎం.పి.లు, ఎం.ఎల్.ఎ.లు పాఠం నేర్చుకుని, తమ ప్రవర్తనను సరిదిద్దుకోవాలి. అంతగా అవసరంగాని అంశాలపై రాద్ధాంతాలకు దిగి విలువైన సభా సమయాన్ని వృథా చేయరాదు. సభను నిర్వహించే స్పీకర్ అన్నింటిని "గిలిటిన్" చేసే పరిస్థితిని సభ్యులు కల్పించరాదు. ఎందుకంటే సభ్యులు ఓ బిల్లుపై చర్చించి ఆమోదిస్తే లోపాలు సరిచేసుకోవచ్చు. తద్వారా ఆ బిల్లుకు సార్థకత. ప్రజాధనానికి సార్థకత లేదంటే ఆ బిల్లుకు చిల్లులు తప్పవు. ప్రజాధనం వృథాకాక తప్పదు. ప్రజాధనం ఎంతో తెలుసా? ఒక గంటసేపు జరిగే పార్లమెంట్ సమావేశానికి పదిహేడు లక్షల రూపాయలు పైగా వ్యయం అవుతుంది. ఈ వ్యయం సభ అర్థాంతరంగా వాయిదా పడినా ఖర్చు ఖర్చే. మరి ఈ విషయాన్ని పాలక పక్షం, విపక్షం గ్రహించి రాజకీయాలు బయట మాట్లాడుకోవాలని సభలో తమ ప్రజల సమస్యల పరిష్కారానికి తాము ప్రతినిధులమని గ్రహించి సభలో హుందాగా చర్చించాలి. సభా గౌరవాన్ని పెంపొందించాలి. నాడే పార్లమెంట్ సమావేశాలన్నా అసెంబ్లీ సమావేశాలన్నా ప్రజలు ఆసక్తిగా తిలకించగలరు. వాటి నిర్వహణపై వచ్చిన వార్తలను చదవటానికి ఉత్సాహం చూపుతారు. నాడే ప్రజాస్వామ్యవ్యవస్థ దేశంలో సుస్థిరంగా మనగలదు. మరి ప్రజా ప్రతినిధులారా ఆలోచించండి; మీ ప్రజల సమస్యలను సభల్లో ప్రతిధ్వనింపజేయండి. సభా కార్యక్రమాలను సజావుగా జరిపించి అందరి అభినందనలు అందుకోండి. మరి మీరేమంటారు?

✤

# Vocational Education is the Need of the Hour

## GRADUATES AND POST GRADUATES ARE ONLY SWELLING THE UNEMPLOYMENT RANKS

**Today** India has +300 million un-employed or under-employed youth, but, we seem to be still interested in encouraging 10+2, and **BA / MA, B.Sc / M.Sc, B.Com / M. COM**....types, who can only do the clerical jobs!

In 'Colonial India', under British rule Sir. Mackauley has introduced reforms in Indian education system, more than a century back. As a result the present 'college' education system has evolved,which we are still following, with some changes now and then.

The British have left. Even after 56 years of independence we are finding it difficult to produce qualified, trained and skilled man-power of international standards, to face the global competition. This is mainly because our education system continues to remain unchanged. The present 'college' system does not prepare the youth for 'skills sets' required to run a nation nor does it provide scope for employment or enterprenuership!

The entry of IT and software has definitely brought in some chages in indian education system, but only to some extent, because in IT & software some such skills are available to the youth in India. However this only comprises 2.0% of the GDP in India and rest of the world.

We need 'skills sets' also for the balance 98% of economic activity, i.e., Manufacturing, Trading and Service sectors.



Dr. Chiranjeevi Kolluri
President,
VOCATIONAL JUNIOR COLLEGES ASSOCIATION
ANDHRA PRADESH

For example the Tourism Industry is seven times the size of I.T. US Tourism budget today is $ 3,700 billions per year. We should have given atleast seven times more importance than what we are giving to I.T., since it is a great employment generator and revenue generator.

The Govt. of India and all state Governments, including A.P. have taken this into cognigence, in order to find a solution to the increasing unemployment and as well drop-outs problem, particularly at 10+ level. Central Governament and all the state Governments have reached a stage where they are finding it difficult to provide the employment. The solution is to encourage and promote Vocational Education and Training in a big way. Even Vision-2020 Document accepts the same.

Developed countries have already adopted it and showing a path to the developing countries.

In Germany and Central European countries, nearly 80-90% of the children entering the age group of 14 and beyond, go in for vocational education & training. Only about 10-15% go ahead for higher studies. The same is also with America, Australia and other countries in Central Europe, at any given time, nearly 1.5% - 2% of the countries population is under some sort of Vocational Education & Traning or skills development programmes, irrespective of the age levels. China already has +1300 Vocational Courses in position. India needs at least 25-27 million people every year, trained in Vocational Education.

Vocational Education not only find a solution to the increasing dropouts and unemployment problem in India, but, also finds a solution to an acute problem of the heavy shortage of qualified, knowledgable and technical personnel in the country, including rural India.

We need many 'skill sets' to run a modern economy. This aspect seems to have been forgotten by our planners. We got to change that situation by encouraging Vocational Education & Training, rather than continue only with the conventional 'college education', as practised today.

Vocational Education opens new avenues to more and more jobs, plus more self-employment opportunities, in India and abroad.

The global demand for technically trained man power with 'skill sets' is increasing day after day.

Hence, 'Vocational Education' has become the **Need of the Hour,** to build our Nation. This is a global phenomenon today.

It is very good news, that, Board of Intermediate Education-A.P., is offering 45 Two year Intermediate Vocational Courses(10+2) and 54 Short Term Courses (3 Months, 6 Months, I Year) for S.S.C. failed/passed, Inter failed/passed, also to Degree students and Graduates, to benefit those who plan to start their earnings at the earliest, as early as from 10 plus 2 onwards.

# Failed SSC Students can study INTER

**from 'THE HINDU'-DAILY**

*Hyderabad, 5 July 2003:*

Students who have failed in SSC need not worry about losing an academic year.

The Board of Intermediate Education (BIE) has launched new vocational courses,which allow the SSc failed students to study them one year and then directly gain admission into the concerned subject, in the vocational courses offfered by the junior colleges. However, they have necessarily to pass SSc examination in the mean time to take admission into the second year of intermediate.

The BIE secretary, B.Kripanandam, said 54 new courses have been launched aimed at students who failed in SSc examinations this year. The students have Three months, Six months and One year courses to choose from and they are basically aimed at developing skills and job oriented.

He said lakhs of students fail in SSc every year and they can make best use of this opportunity.

The three months courses being offered right now include unix, C, C++, VB & oracle with D2k, Auto CAD, Web designing, Computer based Fashion designing, MS- office, DTP, Soft toys & Flower making .

The 6-months courses, already launched, include Diploma in Comp-uter applications, Diploma in IT, Advanced Multimedia Grafics & Animation, Hardware technology, etc.

Some of the one year courses include, Advanced diploma in Comp-uter Applications, Advanced diploma in IT, Building construction, Accountancy, Taxation, Fashion designing, Diploma in Hotel management, Pre primary teaching training, Interior designing and sericulture asst.

*Courtecy by* THE HINDU

# ముఖ్యమంత్రికి మహావిజ్ఞాపన పత్రం

## ముఖ్యమైన సమస్యలు - యుటియఫ్ క్యాంపెయిన్

**పాఠశాలల సమస్యలు:**

1. పాఠ్యపుస్తకముల సత్వర ముద్రణకు, సరఫరాలకు చర్యలు తీసుకోవాలి.
2. మధ్యాహ్న భోజన పథకమును లక్ష్యానికనుగుణంగా నిర్వహించుటకు ప్రత్యేకంగా సిబ్బందిని నియమించాలి. వసతి సమకూర్చాలి.
3. పాఠశాలలలో త్రాగునీరు, మరుగుదొడ్ల సౌకర్యాన్ని ఏర్పాటు చేయాలి.
4. అప్‌గ్రేడెడ్ ప్రాథమికోన్నత, ఉన్నత పాఠశాలలకు ఉపాధ్యాయ పోస్టులను మంజూరు చేయాలి.
5. 45 రోజుల పాటు సాగే గుణాత్మక విద్యా కార్యక్రమం వలన ప్రస్తుత పాఠ్యాంశముల బోధన కుంటుపడుతున్నందున దానిని రద్దుపరచాలి.
6. ఎ) గిరిజన, ఎయిడెడ్ హైస్కూళ్లకు ఇంగ్లీషు, ఫిజికల్ సైన్సు స్కూల్ అసిస్టెంట్ పోస్టులను మంజూరు చేయాలి.
   బి) ఎయిడెడ్, మున్సిపల్, గిరిజన సంక్షేమ పాఠశాలలకు గ్రేడు-II ఫిజికల్ డైరెక్టర్ పోస్టులను మంజూరు చేయాలి.
   సి) అన్ని ప్రాథమిక/ప్రాథమికోన్నత పాఠశాలలకు హెడ్మాష్టర్ పోస్టులను మంజూరు చేయాలి.
   డి) ప్రాథమికోన్నత పాఠశాలలకు పి.యి.టి. పోస్టులను మంజూరు చేయాలి.
7. ప్రాథమిక పాఠశాలల ఉపాధ్యాయులను డెప్యుటేషన్‌పై ఉన్నత పాఠశాలలకు తరలించే 774 ఉత్తర్వును రద్దు చేయాలి.
8. ఉన్నత పాఠశాలలకు, ప్రాథమికోన్నత పాఠశాలలకు యం.ఇ.ఓ.లకు బోధనేతర సిబ్బంది పోస్టులను మంజూరు చేయాలి.
9. (ఎ) పాఠశాల విద్య పరిపాలన అవసరాలకు అనుగుణంగా అధికారుల సంఖ్యను పెంచాలి.
   (బి) యం.ఆర్.పి. వ్యవస్థలో సమూల మార్పులు చేయాలి.
10. పాఠశాలలకు కంటింజెన్సీ గ్రాంటును పెంచాలి.

**ఉపాధ్యాయుల సమస్యలు:-**

1. ప్రభుత్వ, పంచాయతీ రాజ్ పాఠశాలల ఉపాధ్యాయులకు ఉమ్మడి సర్వీసు రూల్సును పునరుద్ధరించాలి. మున్సిపల్, గిరిజన సంక్షేమ పాఠశాలల ఉపాధ్యాయులను కూడా ఉమ్మడి సర్వీసు రూల్సు పరిధిలోనికి తీసుకొని రావాలి.
2. ఎయిడెడ్ ఉపాధ్యాయులకు సమగ్ర సర్వీసు రూల్సు ప్రకటించాలి. ఎయిడెడ్ పాఠశాలలను ప్రభుత్వం స్వాధీనం చేసుకోవాలి.
3. ఎ) ఉపాధ్యాయుల నియామకాల్లో అప్రెంటిస్ విధానం రద్దు చేయాలి.
   బి) అప్రెంటిస్ సర్వీస్ రెగ్యులర్ సర్వీసు గనుక యిప్పటి వరకు అప్రెంటిస్ టీచర్లుగా పనిచేసిన వారికి ఆ సర్వీసుకు 2 నోషనల్ యింక్రిమెంట్లు యిచ్చి, ఆటోమేటిక్ అడ్వాన్సుమెంట్ స్కీమ్‌కి పరిగణించాలి.
4. గత రెండు సంవత్సరాల నుండి పెండింగ్‌లో వున్న ఉపాధ్యాయుల అంతర్‌జిల్లా బదిలీలను అనుమతించాలి.
5. 2003 డి.యస్.సి. వారి నియామకాలకు ముందే ఇన్‌సర్వీస్ ఉపాధ్యాయుల ప్రమోషన్లు, బదిలీలు జరపాలి.
6. ఎ) ఎయిడెడ్ ఉపాధ్యాయుల జీతాలు చెల్లింపుపై యిచ్చిన జి.ఓ.62 అమలుకు చర్యలు తీసుకోవాలి.
   బి) జిల్లా, మండల పరిషత్ పాఠశాలల ఉపాధ్యాయుల జీతాలు ట్రెజరీల ద్వారా చెల్లించే విధానాన్ని అమలు చేయాలి.
   సి) ఎయిడెడ్, మున్సిపల్ ఉపాధ్యాయుల జీతాలపై ట్రెజరీ కంట్రోలు తొలగించాలి.
7. మున్సిపల్, ఎయిడెడ్ ఉపాధ్యాయులకు మెడికల్ రీయింబర్సుమెంట్ సౌకర్యాన్ని వర్తింపచేయాలి.
8. ఎ) మున్సిపల్, ఎయిడెడ్ ఉపాధ్యాయుల టి.పి.యఫ్.ను జి.పి.యఫ్.గా మార్చాలి.
   బి) ఎయిడెడ్ ఉపాధ్యాయులకు 1999 స్కేళ్లలోని జి.ఐ.యస్. స్లాబు రేట్లను వర్తింపచేయాలి.
9. ఎ) జిల్లా పరిషత్, మండల పరిషత్ ఉపాధ్యాయుల జీతాలను 010 హెడ్ ద్వారా చెల్లించాలి.
   బి) తూర్పుగోదావరి, చిత్తూరు, మహబూబ్‌నగర్ జిల్లాల్లో జీతాల చెల్లింపు ప్రయోగాన్ని ఉపసంహరించాలి.
10. హైకోర్టు తీర్పు మేరకు అర్హతలుగల గ్రేడ్-II పండిట్స్‌కు గ్రేడ్-I స్కేలు యివ్వాలి.
11. గ్రేడ్-I పండిట్, గ్రేడ్-II ఫిజికల్ డైరెక్టర్ పోస్టులను స్కూల్ అసిస్టెంట్ పోస్టులుగా పేర్కొనాలి.
12. హైస్కూల్ హెడ్మాష్టర్ పోస్టులను నాన్‌వెకేషన్ పోస్టులుగా పరిగణించాలి.
13. ఎ) స్పెషల్ టీచర్ల సర్వీసును ఆటోమేటిక్ అడ్వాన్సుమెంట్ స్కీముకు, పెన్షనరీ బెనిఫిట్స్‌కు పరిగణించు సౌకర్యమును 1990 తర్వాత నియమించబడిన వారికి కూడా వర్తింపచేయాలి.
    బి) స్పెషల్ టీచర్లకు 8,16 సం॥ స్కేళ్ల మంజూరు తేదీనుండి ఆర్థిక ప్రయోజనాన్ని అనుమతించాలి.
    సి) పై రెండు ప్రయోజనాలను అర్ధమిలియన్ పథకం ఉపాధ్యాయులకు వర్తింపచేయాలి.
14. వృత్తి విద్యా బోధకులను రెగ్యులరైజ్ చేయాలి.
15. స్పెషల్ విద్యావలంటీర్ల సర్వీసును నియామకపు తేది నుండి రెగ్యులర్ సర్వీసుగా పరిగణించాలి.
16. స్పెషల్ విద్యావలంటీర్ల నుండి ట్రైనింగ్ ఫీజు వసూలు చేయుటను ఉపసంహరించాలి.
17. గుర్తింపు గల యూనివర్శిటీలు యిచ్చిన రిలవెంట్ టీచింగ్ డిగ్రీలను ప్రమోషన్‌కు అనుమతించాలి.
18. ఇన్‌సర్వీసు టీచర్లకు రాష్ట్రంలోని అన్ని యూనివర్శిటీలలో కరస్పాండెన్స్ కోర్సు ద్వారా బి.యిడి. చేసే అవకాశం కల్పించాలి.
19. ఎ) అర్హులైన కేటగిరి-II ఉపాధ్యాయులు లేనపుడు కేటగిరి III ఉపాధ్యాయులకు జె.యల్. ప్రమోషన్లు యివ్వాలి.
    బి) జూనియర్ లెక్చరరు ప్రమోషనుకు దామాషా పద్ధతులో ఎయిడెడ్, మున్సిపల్ ఉపాధ్యాయులకు కోటా పునరుద్ధరించాలి. గిరిజన పాఠశాలల ఉపాధ్యాయులకూ అవకాశం కల్పించాలి.
20. ఎ) పెన్షనర్లకు మెడికల్ రీయింబర్సుమెంట్‌ను ఉద్యోగులతో సమానంగా రు.1లక్ష వరకు పెంచాలి.
    బి) పెన్షనర్ల 30 నెలల డి.ఏ. బకాయిలను సత్వరమే చెల్లించాలి.
21. అన్ని యాజమాన్యాలలోని ఉపాధ్యాయులకు యల్.టి.సి. సౌకర్యాన్ని వర్తింపజేయాలి.
22. గత హామీలను, అగ్రిమెంట్లను అమలు జరపాలి.

ఈ నెల 14 నుండి ప్రారంభమవుతున్న యుటియఫ్ సభ్యత్వ క్యాంపెయిన్ సందర్భంలో ఈ మహావిజ్ఞాపన పత్రము పై ఉపాధ్యాయుల సంతకములు సేకరించబడతాయి. అవి అన్నీ రాష్ట్ర కమిటీ ద్వారా ముఖ్యమంత్రిగారికి సమర్పింపబడుతాయి.

సంస్కరణలు-సంక్షేమం-అభివృద్ధి

# సీఎంపీ ముసాయిదా ఇదీ

ఐక్య ప్రగతిశీల కూటమి (యూపీఏ) ప్రభుత్వ కార్యక్రమాల ఎజెండా సిద్ధమయింది. వ్యవసాయానికీ, ఉపాధికీ అధిక ప్రాధాన్యమిస్తూ కనీస ఉమ్మడి కార్యక్రమం (సీఎంపీ) ముసాయిదా తయారయింది. దాని ప్రతులను అన్ని మిత్రపక్షాలకు శుక్రవారం పంపిణీ చేశారు. దానికి సీపీఎం ఆమోదముద్ర వేసింది. శనివారం ప్రధానమంత్రిగా ప్రమాణస్వీకారం చేయనున్న మన్మోహన్ సింగ్ శుక్రవారం విడుదల చేసిన ప్రకటన సారాంశం ముసాయిదాలో ప్రతి ఫలించింది. సంస్కరణలు, సంక్షేమం, అభివృద్ధి నడుమ సమతౌల్యం సాధిస్తామంటూ వ్యవసాయం, ఉపాధి ఆధారిత ఆర్థిక వృద్ధికి సీఎంపీలో పెద్దపీట వేశారు. 16 పేజీల ముసాయిదాలో ముఖ్యాంశాలు ఈ విధంగా ఉన్నాయి. గ్రామీణాభివృద్ధికి గాను అధిక పెట్టుబడులు పెడతామని తెలిపారు. కీలకమైన చమురు, విద్యుత్ రంగాల్లో ప్రైవేటీకరణకు తావులేదని, లాభదాయక ప్రభుత్వ రంగ సంస్థలను విక్రయించబోమని స్పష్టీకరించారు. ఎన్డీఏ ప్రభుత్వ హయాంలో ఆర్థిక వృద్ధి సాధించినా నిరుద్యోగం ప్రబలిందని, యూపీఏ ప్రభుత్వం అన్ని వర్గాల కార్మికుల ముఖ్యంగా అసంఘటిత రంగ శ్రామికుల సంక్షేమానికి కట్టుబడి ఉంటుందని తెలిపారు. కాంట్రాక్టు పద్ధతిని పూర్తిగా తిరస్కరించారు. "కార్మిక విధానంలో కాస్త వెసులుబాటు కల్పించాల్సిన అవసరముంది. కానీ ఆ వెసులుబాటు కార్మికులు, వారి కుటుంబాల ప్రయోజనాలను పూర్తిగా పరిరక్షించేదిగా ఉండాలి" అని పేర్కొన్నారు. ఆరోగ్య బీమా, సామాజిక భద్రతతో పాటు చేనేత కార్మికుల వంటి అసంఘటిత రంగ కార్మికులకు ప్రయోజనాలు కల్పించే పథకాలు చేపడతామన్నారు. కార్మిక విధానంపై పరిశ్రమల యాజమాన్యాలు, కార్మిక సంఘాలతో చర్చలను ప్రతిపాదించారు.

వివాదాస్పద ప్రైవేటీకరణపై ముసాయిదాలో ఆచితూచి వ్యవహరించారు. "ఓఎన్జీసీ,ఐఓసీ,హెచ్పీసీఎల్, బీపీసీఎల్, గెయిల్, ఎన్టీపీసీ, సెయిల్, భెల్ ప్రభుత్వ రంగంలోనే ఉంటాయి. నష్టదాయక కంపెనీలను విక్రయిస్తాం లేదా మూసివేస్తాం. అయితే కార్మికులందరికీ సముచిత చెల్లింపులు పరిహారం చెల్లించాకే ఈ పనిచేస్తాం" అని ప్రతిపాదించారు. విక్రయించే ముందు లేదా మూసి వేసే ముందు ఆయా కంపెనీలను పునరుద్ధరించగల సత్తా ఉన్న ప్రైవేటు రంగ పరిశ్రమల తోడ్పాటు తీసుకుంటామని కూడా చెప్పారు. కేసులవారీగా ప్రైవేటీకరణ చేపడతామని తెలిపారు. పెట్టుబడుల ఉపసంహరణ ద్వారా వచ్చిన సొమ్మును సామాజిక భద్రతకు ఖర్చుపెడతామన్నారు. "పోటీవాతావరణంలో విజయవంతంగా లాభాల బాటన నడుస్తున్న కంపెనీలకు నిర్వహణ, వాణిజ్యపరంగా స్వయంప్రతి పత్తి ఇస్తాం. ప్రభుత్వ రంగాన్ని పటిష్ఠంగా, సమర్థంగా చేసేందుకు మా ప్రభుత్వం కట్టుబడి ఉంది. ఇందుకు గాను వ్యూహాత్మక దృష్టి అవసరం" అని తెలిపారు. ప్రైవేటీకరణకు, సామాజిక అవసరాలకు ప్రత్యక్ష సంబంధం ఉండాలని నొక్కిచెప్పారు. ప్రైవేటీకరణ ఆదాయాన్ని సామాజిక భద్రత పథకాలకు ఉపయోగించాలన్నారు. "ప్రైవేటీకరణ పోటీని పెంచాలే గాని తగ్గించకూడదు" అని స్పష్టంచేశారు. వనరులు పెంచుకోవడానికి, ఇన్వెస్టర్లకు అవకాశాలు కల్పించేందుకు కేపిటల్ మార్కెట్లోకి ప్రవేశించేలా ప్రభుత్వరంగ సంస్థలను, జాతీయ బ్యాంకులను ప్రోత్సహిస్తామన్నారు. గ్రామీణ భారతం అభివృద్ధిపై దృష్టి సారిస్తూ నిలకడగా వృద్ధి, పెట్టుబడులు, ఉపాధికి వీలు కల్పించే విధంగా సంస్కరణలను అమలు చేస్తామని తెలిపారు.

## ఏటా కనీసం వందరోజులు ఉపాధి

తక్షణమే జాతీయ ఉపాధి హామీ చట్టాన్ని తెస్తామని ముసాయిదాలో ప్రకటించారు. దీనివల్ల గ్రామీణ ప్రాంతాల్లో కనీస వేతనంపై ఏటా కనీసం వందరోజులపాటు ఉపాధి లభించేందుకు చట్ట బద్ధమైన సౌకర్యం ఏర్పడుతుందన్నారు. అసంఘటిత రంగంలోని సంస్థలు ఎదుర్కొంటున్న సమస్యలను పరిశీలించేందుకు జాతీయ కమిషన్ను ఏర్పాటు చేస్తామని తెలిపారు. ఈ సంస్థలకు సాంకేతిక, మార్కెటింగ్, రుణ సదుపాయాలు కల్పించేందుకు అనువైన సిఫార్సులు చేయాల్సిందిగా ఈ కమిషన్ను కోరతామని చెప్పారు.

చిన్న మదుపుదారుల ప్రయోజనాలను పరిరక్షిస్తామని ముసాయిదాలో హామీ ఇచ్చారు. పొదుపు చేసుకున్న మొత్తాలను భద్రమైన చోట మదుపుపెట్టేందుకు కొత్త మార్గాలను చూపుతామన్నారు. మార్కెట్లో అవకతవకలకు పాల్పడేవారికి, గందరగోళం సృష్టించేందుకు ప్రయత్నించే వారికి కఠిన దండన తప్పదని హెచ్చరించారు. ఎఫ్ఐఐలను ప్రోత్సహిస్తామన్నారు. పన్నులు, ఇతర విధానాల ద్వారా ఆర్థిక వ్యవస్థను క్రమపద్ధతిలో అభివృద్ధి చేసేందుకు యూపీఏ సర్కారు కట్టుబడి ఉందని తెలిపారు.

## 2009లోగా రెవెన్యూ లోటు నిర్మూలన

వార్షిక వృద్ధి రేటును 8%గా ముసాయిదాలో ప్రతిపాదించారు. 2009లోగా రెవెన్యూ లోటును నిర్మూలిస్తామని ప్రకటించారు. సామాజిక మౌలిక రంగంలో పెట్టుబడులను పెంచుతామన్నారు. అవసరమైన అన్ని చర్యలు తీసుకున్నాక వ్యాట్ను అమలు చేయాలన్నది తమ విధానమన్నారు. వ్యవసాయం, నీటి పారుదల రంగాల్లో ప్రభుత్వ పెట్టుబడులను మరింత పెంచుతామని ముసాయిదాలో పేర్కొన్నారు. ఉపాధి ఆధార వృద్ధికి అధిక ప్రాధాన్యమిస్తామని తెలిపారు. భారీఎత్తున పన్నుల సంస్కరణలను చేపడతామని, పన్నుచెల్లింపుదారుల పరిధిని విస్తరిస్తామని హామీ ఇచ్చారు. దీనికి సంబంధించిన రోడ్మ్యాపును 90 రోజుల్లోగా పార్లమెంటు ముందుంచుతామని పేర్కొన్నారు. పన్నురేట్లు స్థిరంగా ఉంటాయని తెలిపారు. చేనేత, మరమగ్గాలు, కొబ్బరిపీచు, హస్తకళలు, పట్టు, ఫుడ్ప్రాసెసింగ్ తదితర రంగాల ఆధునికీకరణకు కొత్త కార్యక్రమాలను ఏర్పాటుచేస్తామన్నారు. ఖాదీగ్రామీణ పరిశ్రమల సంస్థను పునర్వ్యవస్థీకరిస్తామని తెలిపారు.

స్థూల జాతీయోత్పత్తి (జీడీపీ)లో ఆరు శాతాన్ని విద్యపై ఖర్చుచేస్తామని ముసాయిదాలో తెలిపారు. గత ఐదేళ్లలో విద్యను కాషాయమయం చేశారని, దానిని మారుస్తామని చెప్పారు. విద్య క్వాలిటీని పెంచేందుకు గాను విశ్వ విద్యాలయాలకు నిధులు అందించడానికి అన్ని కేంద్రీయ పన్నులపై సెస్సు విధించాలని ప్రతిపాదించారు. వనరుల కేటాయింపు, కార్యక్రమాల పర్యవేక్షణ కోసం విద్య పై జాతీయ కమిషన్ను ఏర్పాటుచేస్తామన్నారు. ఉన్నత విద్య, వృత్తి విద్యాసంస్థల స్వయంప్రతిపత్తిని నిలబెట్టేందుకు కృషిచేస్తామని చెప్పారు. ఐసీహెచ్ఆర్, ఐసీఈఆర్టీ వంటి సంస్థల్లో నియామకాలకు విద్యార్హతలు, వృత్తినైపుణ్యం కొలమానంగా ఉంటాయని స్పష్టంచేశారు.

## మధ్యాహ్న భోజన పథకం

ప్రాథమిక, సెకండరీ పాఠశాలల్లో పోషకాహారంతో కూడిన మధ్యాహ్న భోజన పథకాన్ని ప్రవేశపెడతామని ముసాయిదాలో ప్రతిపాదించారు. ప్రాథమిక విద్యారంగంలో స్వచ్ఛంద సంస్థలు చేసే కృషికి పూర్తి మద్దతిస్తామన్నారు. సమగ్ర శిశు అభివృద్ధి పథకాన్ని (ఐసీడీఎస్) పిల్లలందరికీ విస్తరింపజేస్తామని హామీ ఇచ్చారు. వచ్చే ఐదేళ్లలో ఆరోగ్య రంగంపై వ్యయాన్ని జీడీపీలో రెండు శాతానికి పెంచుతామన్నారు. పేద కుటుంబాలకు ఆరోగ్య బీమా కోసం జాతీయ పథకాన్ని ప్రవేశపెడతామని తెలిపారు.

నిర్ణీత కాల వ్యవధిలో రిజర్వేషన్ కోటాలను పూర్తిగా అమలు చేస్తామని, పదోన్నతుల్లో కూడా దీనిని పాటిస్తామని ముసాయిదాలో పేర్కొన్నారు.

## మతకల్లోలాలపై చట్టం

1992 ప్రార్థనాస్థలాల చట్టాన్ని పూర్తిగా అమలు చేస్తామని ముసాయిదాలో తెలిపారు. అయోధ్యపై న్యాయస్థానాల తీర్పు కోసం వేచిచూస్తామన్నారు.

అదే సమయంలో సామరస్యపూర్వక పరిష్కారం కోసం చర్చలను ప్రోత్సహిస్తామని తెలిపారు. మతకల్లోలాలకు వ్యతిరేకంగా ఓ సమగ్ర చట్టం తెస్తామని, కేంద్రీయ ఏజెన్సీ వాటిపై దర్యాప్తు జరిగేలా, ప్రత్యేక కోర్టుల్లో విచారణ జరిగేలా చూస్తామని హామీ ఇచ్చారు. మైనారిటీ విద్యాసంస్థల కోసం ఓ కమిషన్‌ను ఏర్పాటుచేసేందుకు రాజ్యాంగాన్ని సవరిస్తామన్నారు. అన్ని మైనారిటీ వర్గాలకూ ఆధునిక, సాంకేతిక విద్య అందేలా చూస్తామని తెలిపారు. విద్య, ఉపాధిల ద్వారా మైనారిటీల సామాజిక, ఆర్థికాభివృద్ధికి కృషిచేస్తామన్నారు.

మత, భాషాపరమైన అన్ని మైనారిటీ వర్గాల వెనుకబాటుతనాన్ని పరిశీలించి వారికి తగు ప్రాతినిధ్యం కల్పించేందుకు తగు సిఫార్సులు చేయడానికి జాతీయ కమిషన్‌ను ఏర్పాటుచేస్తామని తెలిపారు. గిరిజన ప్రాంతాల అభివృద్ధికి రూపొందించిన అన్ని కార్యక్రమాలనూ తక్షణమే సమీక్షిస్తామన్నారు. అభివృద్ధి ప్రాజెక్టుల నిర్మాణం కారణంగా నిరాశ్రయులైన గిరిజనులకు, ఇతర వర్గాలకు సహాయ, పునరావాస వసతులు కల్పించేందుకు సమర్థమైన యంత్రాంగాలను రూపొందిస్తామన్నారు. ఎస్సీ, ఎస్టీ యువత ఉపాధి ఆకాంక్షలను ప్రైవేటు రంగం ఏ మేరకు నెరవేర్చగలదో గుర్తించేందుకు తక్షణమే తమ ప్రభుత్వం పరిశ్రమల యాజమాన్యాలతో చర్చలు ప్రారంభిస్తుందని తెలిపారు. అడవుల్లో పనిచేసే బలహీన వర్గాలకు అటవీ ఉత్పత్తులు పెంచుతున్న భూమి పై యాజమాన్య హక్కులు ఇస్తూ చట్టాలు చేయాలని రాష్ట్ర ప్రభుత్వాలను కోరతామన్నారు. దళితులు, ఆదివాసీల భూములకు నీటి పారుదల సౌకర్యం కల్పించేందుకు సమగ్ర జాతీయ కార్యక్రమాన్ని అమలు చేస్తామని హామీ ఇచ్చారు. భూపరిమితి చట్టం, భూమి పంపిణీ చట్టాల ద్వారా భూమిలేని కుటుంబాలకు కొంత భూమిని కేటాయించేందుకు ప్రయత్నిస్తామన్నారు. నక్సల్స్ సమస్యను పరిష్కరిస్తామని చెప్పారు.

అంతరాష్ట్ర నదీజలాల వివాదాల పరిష్కారానికి అన్ని చర్యలూ తీసుకుంటామని ముసాయిదాలో ప్రతిపాదించారు. కావేరీ వివాదాన్ని ప్రస్తావిస్తూ.. వివాదంలోని అన్ని రాష్ట్రాలకూ న్యాయం చేకూరే విధంగా సామరస్యపూర్వకంగా చర్యలు చేపడతామన్నారు. అన్ని రాష్ట్రాల ప్రయోజనాలను కాపాడుతూ దేశంలోని నదులను అనుసంధానించేందుకు గల సాంకేతిక, ఆర్థిక అవకాశాలను పరిశీలిస్తామన్నారు. ముందుగా దక్షిణాది నదులను అనుసంధానం చేస్తామన్నారు. దక్షిణాది రాష్ట్రాల్లో ఏర్పడిన తాగునీటి కొరతను అధిగమించేందుకు కోరమాండల్ తీరంలో సముద్ర జలాల శుద్ధి కేంద్రాలను నెలకొల్పుతామని హామీ ఇచ్చారు.

### ఎన్నికలకు ప్రభుత్వ నిధులు

ఎన్నికల సంస్కరణలకు తాము కట్టుబడి ఉన్నట్లు ముసాయిదాలో వివరించారు. ప్రభుత్వ నిధులతో ఎన్నికల నిర్వహణ జరిగేలా వీలైనంత త్వరలో చర్యలు చేపడతామన్నారు.

పొరుగుదేశాలతో సత్సంబంధాలు నెలకొల్పేందుకు యూపీఏ ప్రభుత్వం కృషి చేస్తుందని ముసాయిదాలో పేర్కొన్నారు. దక్షిణాసియా దేశాలతో సన్నిహిత రాజకీయ, ఆర్థిక, తదితర సంబంధాలకు అధిక ప్రాధాన్యమిస్తామన్నారు. పాకిస్థాన్‌తో అన్ని అంశాలపైనా చర్చలు నిరంతరం కొనసాగిస్తామని, సరిహద్దు వివాదంపై చైనాతో చిత్తశుద్ధితో చర్చలు జరుపుతామని, చైనాతో వ్యాపారం, పెట్టుబడుల అంశాన్ని పరిశీలిస్తామని తెలిపారు. శ్రీలంకలో శాంతిచర్చలను స్వాగతించారు. " ఆ దేశ ప్రాదేశిక సమగ్రతకు భంగం వాటిల్లకుండా జాతులు, మతాలు, భాషల పరంగా అక్కడున్న మైనారిటీల చట్టబద్ధమైన ఆకాంక్షలను తీర్చే దిశగా జరిగే చర్చలకు మద్దతిస్తాం" అని వివరించారు.

అన్ని ప్రాంతీయ, అంతర్జాతీయ అంశాలపై తమ ప్రభుత్వం భారత విదేశాంగ విధానం స్వతంత్రతను కొన సాగిస్తుందని ముసాయిదాలో తెలిపారు. అమెరికాతో సన్నిహిత వ్యూహాత్మక, ఆర్థిక బంధాన్ని కొనసాగిస్తామని స్పష్టీకరించారు. ప్రపంచ వాణిజ్య సంస్థ (డబ్ల్యూటీఓ)లో జరిగే అన్ని చర్చల్లో జాతీయ ప్రయోజనాలు ముఖ్యంగా రైతుల ప్రయోజనాలకు అగ్రప్రాధాన్యం ఇస్తామని తేల్చిచెప్పారు. "ఇంతకుముందు చేసుకున్న ఒప్పందాలను అమలు చేస్తాం. అదే సమయంలో భారత్ ప్రయోజనాలకు పూర్తి అనుగుణంగా ఒప్పందాలుండేలా కృషి చేస్తాం. భారత వ్యవసాయం, పరిశ్రమలను కాపాడుకునేందుకు ప్రస్తుత డబ్ల్యూటీఓ ఒప్పందాల్లో వెసులుబాటు ఉండేలా చూస్తాం" అని తెలిపారు.

డీఎంకే, ఎండీఎంకేల డిమాండ్‌ను కూడా ముసాయిదాలో చేర్చారు. పోటా రద్దును ప్రతిపాదించారు. గత రెండేళ్లలో ఆ చట్టం తీవ్రస్థాయిలో దుర్వినియోగమయిందని ఆందోళన వ్యక్తం చేశారు. "ఉగ్ర వాదులపై పోరులో రాజీలేదు. కాని పోటా దుర్వినియోగం జరిగిన దరిమిలా యూపీఏ ప్రభుత్వం దీనిని రద్దు చేస్తుంది. ప్రస్తుతం ఉన్న చట్టాలను సమర్థంగా అమలు చేస్తుంది" అని తెలిపారు.

సాయుధ దళాల ఆధునికీకరణలో జాప్యాలను నివారిస్తామన్నారు. "ఆధునికీకరణకు ఇప్పటివరకు సమకూర్చిన నిధులన్నిటినీ వీలైనంత త్వరలో పూర్తిగా సద్వినియోగం చేస్తాం. మాజీ సైనిక సిబ్బంది సంక్షేమానికి రక్షణ శాఖలో కొత్త విభాగం ఏర్పాటు చేస్తాం. దీర్ఘకాలంగా అపరిష్కృతంగా ఉన్న 'ఒకే ర్యాంకు.. ఒకే పెన్షన్' అంశాన్ని పునఃపరిశీలిస్తాం" అని తెలిపారు. జాతీయ భద్రతామండలిని వృత్తిపరంగా సమర్థమైన సంస్థగా మలుస్తామని, పూర్తిస్థాయి భద్రతాసలహాదారును నియమిస్తామని ముసాయిదాలో తెలిపారు.

### ఇదే సమగ్ర ఎజెండా కాదు

ఇది తమ ప్రభుత్వానికి కనీస ఉమ్మడి కార్యక్రమం మాత్రమేనని అందులో పేర్కొన్నారు. ఇది సమగ్ర ఎజెండా కాదన్నారు. తన ప్రధాన ప్రాధాన్యాలు, విధానాలు, కార్యక్రమాలేమిటో చెప్పే దిశగా ఆరంభం మాత్రమేనని తెలిపారు. ఈ కార్యక్రమం అమలుకు యూపీఏ ప్రభుత్వం కట్టుబడి ఉందన్నారు. తమ గరిష్ఠ పనితీరుకు వీలుగా, మరో ఉమ్మడి కార్యక్రమం రూపకల్పనకు ఇది పునాదిగా ఉపకరిస్తుందని ధీమా వ్యక్తంచేశారు.

❋

# ప్రశ్నోత్తరాలు

నిర్వహణ: **కె.జోజయ్య, అధ్యక్షులు, యు.టి.యఫ్**

**ప్రశ్న:** **మండల స్థాయి యం.ఆర్.పి.లు యిష్టారాజ్యంగా వ్యవహరిస్తున్నారు. వారి అధికారములు తెలుప గలరు.**

– ఎం. శ్రీనివాసుల శెట్టి, కర్నూలు

జవాబు: యం.ఆర్.పి.లు చాలామంది అధికారం దర్పంతో వ్యవహరిస్తూ, తోటి ఉపాధ్యాయులను కించపరుస్తూ వ్యవహరిస్తున్నారని అనేక మంది ఉపాధ్యాయులనుండి మాకు పిర్యాదులు అందుతున్నాయి. వారి నియామక విధానమే లోపభూయిష్టంగా వున్నది. అందుచేతనే యం.ఆర్.పి. వ్యవస్థను సమూలంగా సంస్కరించాలని యుటియఫ్ డిమాండ్ చేస్తోంది. యం.ఆర్.పి.ల జాబ్ చార్టుకై 2004 యుటియఫ్ డైరీలోని 46వ పేజీని పరిశీలించండి.

**ప్రశ్న:** **ఆగస్టు 2000 సం॥లో యస్.జి.టి.గా నియామకము పొందాను. షెడ్యూల్డ్ తెగకు చెందిన నేను బి.యిడి. చేయాలనుకుంటున్నాను. నాకున్న అవకాశాలను తెలియజేయండి.**

– యం. రామనాయక్, కలకడ, చిత్తూరు జిల్లా

జవాబు: జి.ఓ. 342 తేది : 30.8.77 (అధ్యాపక దర్శిని-14 పేజీ -282) ననుసరించి యస్.సి.యస్.టి. వర్గములకు చెందిన ఉపాధ్యాయులు బి.యిడి. మొ॥ ఉన్నత విద్యార్హతలను సంపాదించుటకు డెప్యుటేషన్‌పై వెళ్ళవచ్చును. ఆకాలమునకు పూర్తి జీత భత్యములు చెల్లించ బడతాయి. పై ఉత్తర్వులోని కనీస సర్వీసు 5 సం॥ వుండాలనే షరతు జి.ఓ. 7 తేది 2.2.1993 ద్వారా 3 సం॥లకు తగ్గించ బడినది. ఈ విషయమై పాఠశాల విద్యా సంచాలకులు ఆర్.సి.నెం. 5021/డి3-3/2003 తేది : 10.11.2003 (అధ్యాపక దర్శిని-20, పేజీ 95) ద్వారా యిచ్చిన వివరణను పరిశీలించండి.

**ప్రశ్న:** **డిగ్రీ అర్హత కలిగివుండి, అంబేద్కర్ యూనివర్శిటీలో సింగిల్ మెథడాలజీతో బి.యిడి. చేసిన వారు మాత్రమే ఇంగ్లీష్ స్కూలు అసిస్టెంటు పోస్టుకు అర్హులా? అట్లే డిగ్రీలో ఇంగ్లీష్ లేనివారు యం.ఎ. ఇంగ్లీషు చేస్తే అర్హులవుతారా?**

– పి.జె.కె. గోఖలే, పాలకొల్లు, ప॥గో॥

జవాబు: ఇంగ్లీష్ స్కూల్ అసిస్టెంట్ పోస్టుకు గాని మరే పోస్టుకైనా గాని సంబంధిత అర్హతలు content & Methodology కలిగిన వున్నవారు నియామకమునకు / ప్రమోషన్‌కు అర్హులవుతారు. సంబంధిత అర్హతలలో ఏది ముందు, ఏది తర్వాత సంపాదించారనే దానితో సంబంధము వుండదు. అట్లే డిగ్రీలో సంబంధిత అర్హత లేకపోయినా పోస్టు గ్రాడ్యుయేషన్‌లో ఆ అర్హత సంపాదించివున్నా సరిపోతుంది.

**ప్రశ్న:** **1991 వేసవిలో ఎలక్షన్ డ్యూటీ చేసి, ట్రిబ్యునల్ ఉత్తర్వులు పొందిన వారికి సంపాదిత సెలవు ఎం.ఇ.ఓ. గారు జమచేయాలా? డి.ఇ.ఓ. గారు జమచేయాలా?**

– ఆర్. రాజారామ్, మహదేవ్‌పూర్, కరీంనగర్ జిల్లా

జవాబు: జి.ఓ. 40 ప్రకారము సంపాదిత సెలవు జమ చేయు అధికారే పై విషయమై వచ్చే సంపాదిత సెలవును జమ చేస్తారు. అనగా మండల పరిషత్ ఉపాధ్యాయులకు ఎం.ఇ.ఓ. సంపాదిత సెలవును జమ చేస్తారు. అయితే పై విషయమై ట్రిబ్యునల్ ఉత్తర్వు యిచ్చినా 1991 వేసవి సెలవులలో హెడ్‌క్వార్టర్సులో వుండమని సంబంధిత అధికారి ప్రత్యేక ఉత్తర్వు యిచ్చి వుంటేనే సంపాదిత సెలవు జమ చేయాలని ప్రభుత్వం ఉత్తర్వు యిచ్చినది. గమనించగలరు.

**ప్రశ్న:** **గ్రేడ్ -II పండిట్‌గా పనిచేస్తున్న నేను 2003 డి.ఎస్.సి.లో గ్రేడ్ - I పోస్టుకు సెలక్టు అయితే నేను ఏ నిర్ణయము తీసుకోవాలి? గ్రేడ్ - I పోస్టులో చేరిన తరువాత నేను పనిచేసిన గ్రేడ్- II పోస్టును హైకోర్టు ఉత్తర్వు మేరకు అప్‌గ్రేడ్ చేసినట్లయితే నేను $1\frac{1}{2}$ సం॥ సర్వీసును, స్కేలును పోగొట్టుకట కుంటానే మోనని సందేహము. తగిన సూచన చేయగలరు.**

– లత, చిత్తూరు జిల్లా

జవాబు: రివైజ్డ్ పెన్షన్ రూల్సు 1980 నందలి రూలు-26 ప్రకారము గ్రేడ్ – II పోస్టులోని మీ సర్వీసుకు రక్షణ వుంటుంది. కోర్టు తీర్పు అమలై గ్రేడ్ – I గా అప్‌గ్రేడ్ అయినా సదరు రక్షణ కొనసాగుతుంది. కనుక మీరు డి.ఎస్.సి.లో సెలక్టయితే గ్రేడ్ – I పోస్టులో చేరడం సరియైనదే అవుతుంది.

**ప్రశ్న:** **గ్రేడ్ -III లైబ్రేరియన్‌గా పని చేస్తున్న ఉద్యోగి ఎ.పి.పి.ఎస్.సి. ద్వారా గ్రాడ్యుయేట్ లైబ్రేరియన్‌గా నియామకం పొందినారు. పూర్వపు పోస్టులో ఆయన పొందుతున్న కు.ని. యింక్రిమెంట్లు, అదనపు అర్హతల యింక్రిమెంట్లతో సహా వేతన రక్షణ వుంటుందా?**

– పి. శేకరయ్య, ములుగు, వరంగల్ జిల్లా

జవాబు: ఒక ఉద్యోగి పబ్లిక్ సర్వీసు కమీషన్ ద్వారా మరొక పోస్టుకు డైరెక్టు రిక్రూట్‌మెంట్ పొందితే అతనికి యఫ్.22 (A) (iv) క్రింద పూర్వపు పోస్టులోని మూలవేతనమునకు తక్కువగాకుండా క్రొత్త పోస్టులో వేతన స్థిరీకరణ జరుగుతుంది. అయితే పూర్వపు పోస్టులో వుండగా పొందుచున్న కు.ని. యింక్రిమెంట్లు కొనసాగు విషయమై వున్నట్టి స్పష్టమైన ఉత్తర్వులు మా దృష్టిలో లేవు.

**ప్రశ్న:** **జి.ఓ. 1064 అమలు విషయమై విడుదలైన జి.ఓ. 79 ననుసరించి వేతన నిర్ణయము చేయుటలో పలు అభ్యంతరాలను లేవనెత్తుతున్నారు. 1330-2630 స్కేలులోని వేతనము కంటే 1550-3050 స్కేలులోని వేతనము తక్కువగా వుంటేనే వేతన స్థిరీకరణను అనుమతిస్తున్నారు. వేతనం సమానంగా వుంటే అంగీకరించుట లేదు. పరిష్కార మార్గం తెలియ జేయగలరు.**

– డి. అచ్యుతరావు, తెనాలి, గుంటూరు జిల్లా

జవాబు: యస్.జి.టీ.లకు 1986 స్కేళ్ళలో 22 సం॥ల స్కేలులో వేతన నిర్ణయం చేయు సందర్భంలో వుత్పన్నమైన పై సమస్యపై లేవనెత్తబడిన అసమంజసమైన అభ్యంతరాలను ప్రభుత్వ దృష్టికి తీసుకెళ్ళినా సరియైన స్పందన లేదు. విసిగి వేసారిన కొందరు ట్రిబ్యునల్‌కు అప్పీలు చేసుకోవడం ద్వారా జి.ఓ. 1064ను సానుకూలంగా అమలు చేయించుకొంటున్నారు. మీరు కూడా ఆ ప్రయత్నం చేయండి.

**ప్రశ్న:** **ఉన్నత పాఠశాలలందు ఎగ్జామినేషన్స్ సెక్రటరీగా ఫిజికల్ సైన్సు స్కూల్ అసిస్టెంట్ నిర్వహించాలని -సె9/4276/2003 తేది 12.3.2003 ద్వారా ఏమైనా ఉత్తర్వులు వెలువడినవా? తెలుపగలరు.**

– డి. రవి, నాగిళ్ళ, యం. నగర్ జిల్లా

జవాబు: పాఠశాల విద్యా సంచాలకుల వారి కార్యాలయము నుండి మీరు పేర్కొన్న నంబరుతో ఉత్తర్వులు వెలువడి వుండవు. సదరు ఉత్తర్వులు ఏ కార్యాలయము నుండి వెలువడినది మీరు వ్రాయలేదు. ఫలానా సబ్జక్టువారే ఎగ్జామినేషన్స్ సెక్రటరీగా వుండాలనే ఉత్తర్వులు ఎవరు యిచ్చివున్నా అవి సక్రమమైనవి కావు.

కన్యాకుమారిలో

# ఉత్సాహ భరితంగా జరిగిన యస్.టి.యఫ్.ఐ. అధ్యయన తరగతులు

యన్. రమణయ్య శాస్త్రి
యు.టి.యఫ్. సహాధ్యక్షులు

భారత పాఠశాలల ఉపాధ్యాయుల సమాఖ్య (యస్‌టియఫ్ఐ) జనరల్ కౌన్సిల్ సభ్యులకు కన్యాకుమారిలో అత్యంత ఉత్సాహభరితమైన వాతావరణంలో అధ్యయన తరగతులను నిర్వహించారు. మేనెల 24న యస్.టి.యఫ్.ఐ ఆఫీస్ బేరర్ల సమావేశం శ్రీ డి.రామిరెడ్డి గారి అధ్యక్షతన జరిగింది. 25,26 తేదీలలో జనరల్ కౌన్సిల్ సభ్యులకు అధ్యయన తరగతులు నిర్వహించారు. ఈ తరగతులను పశ్చిమ బెంగాల్ సెకండరీ విద్యాశాఖ మంత్రిగాగత 27 సంవత్సరాలుగా పని చేస్తున్న, దేశంలోనే అత్యంత సీనియర్ విద్యామంత్రి అయిన శ్రీ కాంతిబిస్వాస్ ప్రారంభించారు. సమాజంలో ఉపాధ్యాయుని పాత్ర చాల గొప్పదని, తల్లి, తండ్రి, దైవంకన్నా ఉపాధ్యాయునికి అధికప్రాధాన్యత యిస్తారని అందుకే గురు:బ్రహ్మ, గురు:విష్ణు:, గురుదేవోభవ - అని ప్రాచీన కాలం నుండి గురువును గుర్తిస్తున్నారని, ఇటీవలికాలంలో A.C. Nielson ఆధ్వర్యంలో ఒక Research Agency 7 మెట్రోపాలిటన్ నగరాలలో జరిపిన సర్వేలో సమాజానికి ఎక్కువగా ఉపయోగపడే వర్గం ఏది? - అన్న ప్రశ్నకు అత్యధికంగా 15.9% మంది ఉపాధ్యాయులని, 14.2% డాక్టర్లని, 12.8% రక్షణశాఖని, 11.8% రైతులని, 11.7% న్యాయమూర్తులని తేలింది. దీన్ని బట్టి సమాజంలో ఉపాధ్యాయుని పాత్ర తెలుస్తున్నదని, అందువలన సమాజ పరిణామంలో ఉపాధ్యాయుడు నిర్వహించవలసిన పాత్ర ఎంతో ఉందని ఆయన అన్నారు.



శిక్షణా తరగతులకు ప్రారంభిస్తున్న పశ్చిమ బెంగాల్ విద్యా శాఖ మంత్రి కాంతి బిస్వాస్

అలాగే భారత దేశంలో ఉన్న విద్యా విధానం గురించి, అక్షరాస్యత గురించి, ఇతర అభివృద్ధి చెందుతున్న దేశాల్లో విద్య పై కేటాయింపులు - భారతదేశంలో కేటాయింపులు ప్రాథమిక స్థాయినుండి ఉన్నత స్థాయి వరకు ఎలా ఉన్నాయో పట్టికలతో సహా శ్రీ బిస్వాస్ వివరించారు. ప్రపంచీకరణ విధానాల వల్ల అభివృద్ధి చెందుతున్న దేశాలు విద్యారంగంలో ఏవిధంగా వెనకబడుతున్నాయో తెలియజేశారు. ప్రాథమిక విద్యను ప్రాథమిక హక్కుగా చేస్తూ చేసిన 86వ రాజ్యాంగ సవరణ లో మొత్తం ఖర్చుబాధ్యతలను రాష్ట్ర, స్థానిక సంస్థలకు అప్పగించి కేంద్రం చేతులు దులుపుకుందని శ్రీ కాంతిబిస్వాస్ విమర్శించారు.

మధ్యాహ్నం శ్రీ డి.రామిరెడ్డి గారు **ఉపాధ్యాయ ఉద్యమ నిర్మాణం** గురించి బోధించారు. యస్.టి.యఫ్.ఐ.కి అనుబంధంగా వివిధ రాష్ట్రాలలో ఉన్న ఉపాధ్యాయ సంఘాలు, వాటి నిర్మాణం, ఉపాధ్యాయుల సర్వీసు కండీషన్స్, సెలవు నిబంధనలు, మొదలైన వాటిని వివరంగా బోధించారు.

26.05.2004 ఉదయం అఖిల భారత వ్యవసాయ కార్మిక సంఘం ప్రధానకార్యదర్శి కా॥వరదరాజన్ **ప్రస్తుత ఆర్థిక విధానం** పై సవివరంగా బోధించారు. మధ్యాహ్నం కేరళ లోని కాలడి లోగల శ్రీ శంకర సంస్కృత విశ్వవిద్యాలయం ఉపకులపతి (వైస్ ఛాన్సిలర్), ప్రముఖ ఆర్థిక శాస్త్రవేత్త ప్రొఫెసర్ కె.యన్. పణిక్కర్ విద్యారంగంలో వస్తున్న మార్పులను గురించి వివరిస్తూ గత ప్రభుత్వం విద్యారంగంలో మతతత్వ ధోరణులను ఏవిధంగా ప్రవేశ పెట్టిందో వివరిస్తూ దాన్ని సవరించవలసిన అవసరాన్ని నొక్కి చెప్పారు.

27.05.2004న జనరల్ కౌన్సిల్ సమావేశం శ్రీ డి.రామి రెడ్డి గారి అధ్యక్షతన జరిగింది. యస్.టి.యఫ్.ఐ ప్రధానకార్యదర్శి కా॥ తుషార్ పంచానన్ కార్యకలాపాల నివేదికను సమర్పించారు. దీనిపై జరిగిన చర్చలలో వివిధ రాష్ట్రాల ప్రతినిధులు పాల్గొన్నారు. తమ తమ రాష్ట్రాల నివేదికలను కూడ ప్రతినిధులు ప్రవేశ పెట్టారు. మన రాష్ట్రం తరపున రాష్ట్ర సహాధ్యక్షులు శ్రీ యన్. రమణయ్య శాస్త్రి చర్చలో పాల్గొంటూ గత డిసెంబర్‌లో హైదరాబాదులో నిర్వహించిన 9వ రాష్ట్ర మహాసభల విశేషాలను, జనవరిలో I.R/D.R. కోసం చేసిన ఉద్యమం, 24.2.2004 న జరిగిన అఖిల భారత సమ్మె, ఇటీవలిఎన్నికలలో మన పాత్ర, మే డే ఉత్సవాలు వంటి పలు అంశాల గురించి నివేదికను యిచ్చారు. యస్.టి.యఫ్.ఐ దేశ వ్యాప్తంగా విస్తరించడానికి, బలపడేందుకు యస్‌టియఫ్ఐ కేంద్ర కార్యాలయాన్ని ఢిల్లీకి మార్చాలని, ఒక బాధ్యుడు అక్కడ ఉండి మానవ వనరుల మంత్రిత్వ శాఖతో నిరంతరం సంబంధం కలిగి ఉండాలని, యన్.సి.ఇ.ఆర్.టి. లో జరిగే విద్యా విషయక కార్యకలాపాలలో పాలుపంచుకోవాలని, గత ప్రభుత్వం సిలబస్‌లో చేసిన మార్పులను సమీక్షించేలా చర్యలు తీసుకోవాలని యస్.టి.యఫ్.ఐ. కి అనుబంధంగా లేని ఉపాధ్యాయ సంఘాలను యస్.టి.యఫ్.ఐ. లోకి వచ్చేలా ప్రయత్నం చేయాలని, భావసారూప్యం గల మేధావులతో సంబంధాలు పెట్టుకొని సదస్సులు, వర్కు షాపులు ఢిల్లీలో నిర్వహించాలని సూచించారు. ఆ రోజు సాయంత్రం నాగర్ కోయిల్ లో ఉపాధ్యాయుల ప్రదర్శన, బహిరంగ సభ జరిగాయి. బహిరంగ సభలో దేశపు వివిధ ప్రాంతాల నాయకులతోపాటు నాగర్‌కోయిల్ యం.పి. శ్రీ బెల్లార్మిన్ (సి.పి.ఐ(యం)) పాల్గొని ప్రసంగించారు.

ఈ కార్యక్రమాల్లో మన రాష్ట్రం నుండి యస్.టి.యఫ్.ఐ అధ్యక్షులు శ్రీ డి.రామిరెడ్డి, కార్యదర్శి శ్రీమతి యం.సంయుక్త, కార్యవర్గసభ్యులు, శ్రీయన్.రమణయ్యశాస్త్రి, శ్రీ సిహెచ్.సుభాష్‌చంద్ర బోస్, కౌన్సిల్ సభ్యులు శ్రీ పి.పుల్లయ్య, శ్రీ సయ్యద్ జియావుద్దీన్, ప్రత్యేక ఆహ్వానితులుగా శ్రీ పి.కృష్ణమూర్తి, శ్రీ యం.నరహరి, శ్రీ పి.బాబు రెడ్డి, శ్రీ కె.వెంకట్రావు పాల్గొన్నారు.

ఈ అధ్యయన తరగతుల నిర్వహణకు ఆతిథ్యం యిచ్చి, జయప్రదంగా నిర్వహించిన కన్యాకుమారి జిల్లా కార్యకర్తలను, తమిళనాడు రాష్ట్ర నాయకులను యస్.టి.యఫ్.ఐ నాయకత్వం అభినందించింది. ఇటువంటి కార్యక్రమాలను దేశంలోని వివిధ ప్రాంతాలలో నిర్వహించడం ద్వారా కార్యకర్తల అవగాహనను పెంచాలని, ఐక్యతా బంధాన్ని దృఢపరచాలని ప్రతినిధులు నాయకత్వాన్ని కోరారు.

## యుటియఫ్ రాష్ట్ర ఉద్యమ తరగతులు

ఉపాధ్యాయ సంక్షేమం, విద్యారంగ సర్వతోముఖ వికాసం, సమసమాజ నిర్మాణానికి తోడ్పడం ధ్యేయంగా ఆవిర్భవించి అనతికాలంలో ఆంధ్ర రాష్ట్రమంతటా విస్తరించి లక్షాపదిహేను వేలమంది సభ్యులతో అలరారుతూ మూడుపదుల వసంతాలు ముచ్చటగా పూర్తయ్యేవేళ ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ తరం మారిన యువ నాయకత్వానికి తన ఆశయాలు, లక్ష్యాలు, ఉద్యమ చరిత్ర మొదలుగా గల పెక్కు అంశాలను బోధించడానికి పునశ్చరణ తరగతులను ఏర్పాటు చేసింది.

ఆందోళనా పోరాటాలతో ప్రభుత్వంతోనూ నాయస్థానంలోను పోరాటాలు సాగించి సాధించిన హక్కులకు గ్రహణం పడుతున్న వైనం ఒకటైతే, అధికారులకు అంటకాగితే అన్ని సమస్యలూ పరిష్కారమవుతాయనే అశాస్త్రీయమైన, అవకాశావాదంతో కూడిన ఆలోచనలు, ఆశలు పెంచుకుంటూ, తమ సమస్యతప్ప పక్కవారికి సమస్య పట్టని మరోవైనం ప్రమాదకరంగా తయారయ్యాయి. ఈ స్థితిలో ఉపాధ్యాయ వర్గానికి వాస్తవ, చారిత్రక ఘటనలను తెలియజేస్తూ వారిని ఆందోళనలకు, పోరాటాలకు సిద్ధపరచాల్సిన జిల్లాల నాయకత్వస్థాయిని పెంచి పటిష్ఠం చేసేందుకు యుటియఫ్ ఈ తరగతులను నిర్వహించింది.

గుంటూరు జిల్లాలో పెదవడ్ల పూడి జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలో రాష్ట్ర ఉద్యమ తరగతులు 2004 జూన్ 3,4,5 తేదీలలో జరిగాయి. ప్రారంభ సమావేశంలో రాష్ట్ర ప్రధాన కార్యదర్శి ఎన్. నారాయణ స్వాగతం పలుకగా రాష్ట్ర అధ్యక్షులు కె. జోజయ్య అధ్యక్షత వహించారు. యుటియఫ్ సీనియర్ నేత, భారత పాఠశాల ఉపాధ్యాయుల సమాఖ్య (ఎస్.టి.ఎఫ్.ఐ.) అధ్యక్షులు డి. రామిరెడ్డి ఉద్యమ తరగతులను ప్రారంభించారు. ఈ కాలంలో ప్రధానమైన అనేక మార్పులు వచ్చాయని అవి నూతన ఆర్థిక విధానాలు, ప్రాంతీయతత్వం వంటి పలు రూపాలలో వస్తున్నాయన్నారు. గత కేంద్ర ప్రభుత్వ విధానాల మూలంగా మతతత్వం వేళ్ళూనుకొని పోయిందని, మతతత్వాన్ని తెచ్చిన ప్రభుత్వం పోయినా మతతత్వం పోలేదని, దానిపైన పోరాటంచేయవలసిన ఆవశ్యకత ఇంకా మిగిలే ఉందని, సామ్యవాద వ్యవస్థ రూపొందనిదే సమస్యలు పరిష్కారం కావని, అందుకే వ్యూహం, ఎత్తుగడలు మార్చుకొని పెరుగుతున్న ఉద్యమాలను కాపాడుకోవాలని ఉద్బోధించారు. సీనియర్ నాయకులు కె. అంజిరెడ్డి, కె. కేశవ రెడ్డి గారలు సందేశాలిచ్చారు. రాష్ట్ర గౌరవాధ్యక్షులు పి. కృష్ణమూర్తి ఉద్యమ తరగతులకు ప్రిన్సిపాల్‌గా వ్యవహరించారు.

**ఉద్యమ చరిత్ర** అనే అంశాన్ని ఎం.ఏ.కె. దత్తు గారు బోధిస్తూ 1947కు పూర్వం, 1947 తర్వాత, 1974 నుండి ఉపాధ్యాయుల స్థితి గతులు, మలబార్ సమ్మె, సంఘాలు ఏర్పడడం; హక్కులకోసం చేసిన పోరాటాలు వివరించి యుటియఫ్ ఏర్పడడానికి చారిత్రక పరిణామాలే కారణమయ్యాయని తెలిపారు. తాను నిర్వహించిన విశిష్ట ఉద్యమాల కారణంగానే యుటియఫ్ రాష్ట్రంలో అతిపెద్ద సంఘంగా ఎదిగిందని ఆయన వివరించారు.

**"నాయకత్వం - పద్ధతులు"** అనే అంశాన్ని ఎస్.టి.ఎఫ్.ఐ. అధ్యక్షులు డి. రామిరెడ్డిగారు బోధించారు. సమాజాన్ని నిరంతరం అధ్యయనం చేయాలని, పేదల స్థితి గతులు మారనిదే సమాజం అభివృద్ధి చెందజాలదనే భావజాలాన్ని పెంచాలని, సామ్యవాద సమాజం రావాలని, సామాజిక అభివృద్ధికి తోడ్పడే ఉద్యమాలకు సహకరించాలని, మానవ సంబంధాలను అభివృద్ధి పరచుకొని, సమయపాలనతో సమయాన్ని సద్వినియోగం చేసుకోవాలని, ఉపాధ్యాయుడు (నాయకుడు) ఆదర్శవంతంగా జీవించాలని బోధించారు.

**"ప్రభుత్వ విధానాలు-ఉద్యోగుల కర్తవ్యాలు"** అనే అంశాన్ని సెంటర్ ఆఫ్ ఇండియన్ ట్రేడ్‌యూనియన్స్ (సి.ఐ.టి.యు.) రాష్ట్ర ప్రధానకార్యదర్శి ఎస్. వీరయ్య గారు బోధించారు. ప్రపంచబ్యాంకు విధానాలు-ఉద్యోగుల పై వాటి ప్రభావం, వాటి పర్యవసానంగా ఉద్యోగులు అనివార్యంగా ప్రభుత్వాల తిరోగమన ఆర్థిక విధానాలను వ్యతిరేకించేవారితో కలసి పని చేయడం ఆరంభమైందని ఈ క్రమంలో అనేక దేశాలలో లక్షలాదిమంది వీధుల్లోనికి వచ్చారని చెప్పారు. "సమ్మెలు కార్మికులకు రాజకీయ పాఠశాలలు" అన్న లెనిన్ మాటలను ఉదహరిస్తు, అందుకే "సమ్మె హక్కుకోసం సమ్మె" చేయడంతో ప్రభుత్వాన్ని నిలదీసే స్థితికి ఉద్యోగులు చేరుకొన్నారని, శ్రమ జీవుల, బుద్ధి జీవుల ఐక్యతను కాపాడడంలో, బృహత్తర ఉద్యమాలను జె.ఎ.సి.ని నిర్మించడంలో యుటియఫ్ ప్రధాన పాత్రవహించాలనే కర్తవ్యాన్ని ఉద్బోధించారు.

**"సంఘ నిర్మాణం"** అనే అంశాన్ని రాష్ట్ర అధ్యక్షులు కె. జోజయ్య బోధించారు. సంఘానికి స్పష్టమైన ఒక విధానం (పాలసీ) అవసరమని, కార్యకర్తల చట్రమే నిర్మాణమని, అవగాహన, సంకల్పం, ఐక్యత ఉండాలని, నిర్దిష్టమైన దృక్పధం లేకపోతే సంఘంలో పనిచేయజాలమని అన్నారు. స్వంత, ఐక్య కార్యాచరణ లేకపోతే సంఘం పెరగదని వీటికి ఉద్యమ వాణి అయిన 'ఐక్య ఉపాధ్యాయ'ను, 'యుటియఫ్ వార్తల'ను శక్తివంతంగా నిర్వహించాలని, ఇవి సక్రమంగా నిర్వహించ బడాలంటే నిర్మాణం పని పద్ధతులు మెరుగు పడాలని చెప్పారు. **సాధారణ సర్వీసు నిబంధనలు** అనే అంశాన్ని కూడా జోజయ్య గారు బోధించారు.

**నియమ నిబంధనలు** అనే అంశాన్ని, **ఫండ మెంటల్ రూల్స్ (ఎఫ్.ఆర్.)** విషయాలను రాష్ట్ర అకడమిక్ సెల్ కన్వీనర్ కె. వెంకట్రావు గారు చర్చా పద్ధతిలో బోధించారు.

ఈ తరగతులకు రాష్ట్ర కార్యదర్శివర్గ సభ్యులు, అన్ని జిల్లాల ప్రిన్సిపల్ ఆఫీసు బేరర్లు, మహిళా కార్యదర్శులు, ఆడిట్ కన్వీనర్‌లు హాజరైనారు. 150 మంది పాల్గొన్న ఈ తరగతుల నిర్వహణలో రాష్ట్ర అధ్యక్ష, ప్రధానకార్యదర్శుల ఆధ్వర్యంలో స్థానిక జిల్లా పరిషత్తు ఉన్నత పాఠశాల ఉపాధ్యాయులు ఇతర సిబ్బంది, మంగళగిరి మండల కార్యకర్తలు ఎంతో తోడ్పడ్డారు. తరగతుల విజయవంతానికి కృషి చేసిన అందరికీ రాష్ట్ర కమిటీ అభినందనలు తెలిపింది.

**తూర్పుగోదావరి జిల్లా**

### యుటియఫ్ కార్యకర్తలకు శిక్షణా తరగతులు

తూర్పుగోదావరి జిల్లా యుటియఫ్ కార్యకర్తలకు ఉపాధ్యాయుల సర్వీసు విషయాలపైన, యుటియఫ్ ఉద్యమంపైన అవగాహన కలిగించేందుకు జిల్లాశాఖ ఆధ్వర్యంలో మే 8,9,10 తేదీలలో కాకినాడలో శిక్షణా తరగతులు నిర్వహించబడినవి. జిల్లా శాఖ గౌరవాధ్యక్షుడు పి.వి. రాఘవులు ప్రిన్సిపాల్‌గా వ్యవహరించగా రాష్ట్ర కార్యదర్శి పి. పుల్లయ్య తరగతులను ప్రారంభించారు. ఎస్.టి.ఎఫ్.ఐ. అధ్యక్షులు డి. రామిరెడ్డి యుటియఫ్ కార్యకర్తలకు ఉండవలసిన లక్షణాలను, ఉద్యమ నిర్మాణంలో ఆచరించవలసిన పద్ధతులను వివరించారు. రాష్ట్ర ప్రధానకార్యదర్శి ఎన్. నారాయణ యుటియఫ్ (పాలసీ స్టేట్‌మెంట్)ను. అధ్యక్షులు కె. జోజయ్య, సర్వీస్ నిబంధనలను అకడమిక్ సెల్ కన్వీనర్ కె. వెంకటరావు ఫండమెంటల్ రూల్స్, లీవ్ రూల్స్ అంశాలను, ప్రకాశం జిల్లా సీనియర్ నాయకులు సి. సత్యనారాయణ శర్మ పెన్షన్ రూల్స్‌ను, పెన్షన్ లెక్కింపు పద్ధతులను వివరించారు. జిల్లా శాఖ సహాధ్యక్షుడు కె. సత్తిరాజు వివిధ రకాల దరఖాస్తులను ఏ విధంగా పూర్తి చేయాలో వివరించారు. జిల్లా శాఖ అధ్యక్షుడు ఐ. వెంకటేశ్వర రావు, ప్రధానకార్యదర్శి కె. జార్జివిక్టర్, కోశాధికారి టి. సూర్యనారాయణ ఇతర కార్యదర్శివర్గ సభ్యులు శిక్షణా తరగతుల ఏర్పాట్లను పర్యవేక్షించారు.

## ప్రకాశం జిల్లా ఉద్యమ శిక్షణా తరగతులు

ప్రకాశం జిల్లాలో మండల శాఖల ప్రధాన బాధ్యులకు శిక్షణా తరగతులను డివిజన్‌ల వారీగా జరుపాలని నిర్ణయించారు. మొదటి బ్యాచి తరగతులు జూన్ 9,10,11 తేదీలలో పొందూరు ఉన్నత పాఠశాలలో జరిగాయి. దాదాపు 80 మంది కార్యకర్తలు పాల్గొన్నారు. తరగతుల కొరకు ప్రకాశం జిల్లా అకడమిక్ కౌన్సిలు బోధనాంశములపై వివరంగా విజ్ఞాన దీపిక-1 అనే పుస్తకం ప్రచురించింది.

9వ తేదీ ప్రారంభ సభకు జిల్లా అధ్యక్షులు యం.వెంకటేశ్వర రెడ్డి అధ్యక్షత వహించారు. ప్రధానకార్యదర్శి కె.ఆదినారాయణ కార్యక్రమ వివరాలు

తెలియజేశారు. యస్.టి.యఫ్.ఐ అధ్యక్షులు శ్రీ డి.రామిరెడ్డి తరగతులు ప్రారంభించడంతో పాటు **నిర్మాణం, కార్యకర్తల వ్యక్తిత్వ వికాసం** అనే అంశాలు బోధించారు. రాష్ట్ర ప్రధానోపాధ్యాయుల సంఘం అధ్యక్షులు డి.లక్ష్మిరెడ్డి, యు.టి.యఫ్. రాష్ట్ర అకడమిక్ సెల్ కన్వీనర్ కె.వెంకట్రావు, ప్రచురణ విభాగం మాజీ కన్వీనర్ టి.కొండాచారి, రాష్ట్రకార్యదర్శి జి.శేషయ్య సందేశాలిచ్చారు. రెండవ రోజు **వర్తమాన ఆర్థిక రాజకీయ పరిస్థితులు** అనే అంశాన్ని సి.ఐ.టి.యు. నాయకులు పి.ఆంజనేయులు, మూడవ రోజు యం.ఏ.కె.దత్తు **ఉద్యమ చరిత్ర**ను,**ఫండమెంటల్ రూల్సు (యఫ్.ఆర్)**ను కె.వెంకట్రావు, **పెన్షన్ నియమనిబంధనలను** సి.సత్యనారాయణశర్మ, **ప్రావిడెంట్‌ఫండ్ (పి.యఫ్.), యఫ్.బి.యఫ్.** నిబంధనలను, షేక్ షంషుద్దీన్, **జి.యల్.ఐ.యస్** ను యం.వెంకటేశ్వరరెడ్డి, **సెలవు నిబంధనలను** టి.కొండాచారి, జి.శేషయ్య బోధించారు. మూడు రోజుల క్లాసులకు టి.నారాయణ రావు ప్రిన్సిపల్‌గా వ్యవహరించారు. డి.రామిరెడ్డి పర్యవేక్షించారు. స్థానిక కార్యకర్తలు రమేశ్, చంద్రమౌళి వసతి ఏర్పాట్లు చేశారు. తరగతులు ఎంతో ఉపయోగకరంగా ఉన్నాయని అందరూ అభిప్రాయపడ్డారు.

## ముదిగొండలో ఖమ్మం జిల్లా ఉద్యమ తరగతులు

యు.టి.యఫ్. ఖమ్మం జిల్లా శాఖ జూన్ 9,10,11, తేదీల్లో ముదిగొండ జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలో జిల్లా ఉద్యమ తరగతులను విజయవంతంగా నిర్వహించింది. అత్యంత ఆహ్లాద పూరిత వాతావరణంలో జిల్లాలోని 40 మండలాల నుండి విచ్చేసిన ప్రధాన నాయకులతో పాటు ముఖ్యమైన కార్యకర్తలు 200 మంది హాజరైన ఈ శిక్షణా తరగతులు జూన్ 9వ తేదీ ఉదయం 10 గంటలకు యుటియఫ్. రాష్ట్ర కార్యదర్శి సయ్యద్ జియావుద్దీన్ ఉద్యమ పతాకావిష్కరణతో ప్రారంభమయ్యాయి. యు.టి.యఫ్. జిల్లా అధ్యక్షులు బి.నరసింహారావు ప్రారంభ సభకు అధ్యక్షత వహించగా ముఖ్య అతిథిగా పాలేరు శాసన సభ్యులు శ్రీ సంభాని చంద్రశేఖర్, ఉద్యమ తరగతుల ప్రారంభకులుగా ఖమ్మం శాసన సభ్యులు శ్రీ తమ్మినేని వీరభద్రం



శిక్షణా తరగతులను ప్రారంభిస్తున్న ఖమ్మం ఎం.ఎల్.ఎ. తమ్మినేని వీరభద్రం

హాజరయ్యారు. శ్రీ సంభాని చంద్రశేఖర్ ప్రసంగిస్తూ సామాజిక స్పృహ కలిగిన సంఘంగా యు.టి.యఫ్. విద్యారంగ, సామాజిక సమస్యల పట్ల నిబద్ధతో కృషి చేస్తున్నదని కొనియాడుతూ, అదే వరవడిని కొనసాగించాలని కోరారు. పి.ఆర్.సి తదితర హామీల విషయాన్ని ముఖ్యమంత్రి గారి దృష్టికి తీసుకువెళ్తానని అన్నారు. శ్రీ తమ్మినేని వీరభద్రం ఉద్యమ తరగతులను ప్రారంభిస్తూ విపరీతమైన భారాలు మోపిన ప్రభుత్వాన్ని సాగనంపడానికి ఉద్యోగ, ఉపాధ్యాయ వర్గాలు చేసిన అవిరళ కృషికి ప్రత్యేక కృతజ్ఞతలు తెలియజేశారు. ప్రజలు యిచ్చిన తీర్పు ఏ పార్టీకి అనుకూలం కానీ, వ్యతిరేకం కానీ కాదని, ప్రపంచ బ్యాంకు విధానాలకు వ్యతిరేకంగా యిచ్చిన తీర్పని, ప్రస్తుత పాలకులు దీన్ని గుణపాఠంగా తీసుకొని ప్రజాసమస్యల పరిష్కారానికి కృషి చేయాలని అన్నారు. ప్రభుత్వం మారినంతనే ప్రపంచ బ్యాంకు వినాశకర విధానాల భయం తొలగిపోలేదని, ఇవి మరో రూపంలో కొనసాగే అవకాశం వుంది కాబట్టి యు.టి.యఫ్. వంటి సమరశీల సంఘం అప్రమత్తంగా ఉండి ప్రజావ్యతిరేక విధానాలను ఎదుర్కోవాలని ఆయన కోరారు. ఈ శిక్షణా తరగతులు భవిష్యత్ పోరాటాలకు కార్యకర్తల్లో స్ఫూర్తిని కలిగించాలని, సంఘం నిర్వహించే అన్ని ఉద్యమాలకు తన సహకారం వుంటుందని హామీ యిచ్చారు. ముదిగొండ యం.ఆర్.ఓ. శ్రీ ప్రియవ్రతుడు తదితరులు ఈ ప్రారంభ సమావేశంలో పాల్గొన్నారు.

అనంతరం **వర్తమాన రాజకీయ సామాజిక పరిణామాలు** అనే అంశాన్ని ఖమ్మం జిల్లా సి.ఐ.టి.యు. అధ్యక్షుడు యం.సాయిబాబు విశ్లేషణలతో అత్యంత ఆసక్తికరంగా బోధించారు. రెండవ అంశంగా **జిల్లా ఉద్యమ అభివృద్ధి-కర్తవ్యాలు, సంఘ నిర్మాణం**ను జిల్లా అధ్యక్షులు బి.నరసింహారావు బోధించగా, మూడవ అంశంగా **ఉపాధ్యాయ ఉద్యమ చరిత్ర**ను జిల్లా గౌరవాధ్యక్షులు కె.శ్రీనివాసులు బోధించారు.

తరగతుల రెండవ రోజు యు.టి.యఫ్ రాష్ట్ర ప్రధానకార్యదర్శి నాగటి నారాయణ ప్రస్తుతం రాష్ట్ర విద్యారంగంలో నెలకొన్న పరిణామాలను **వర్తమాన విద్యారంగం-ఉపాధ్యాయ ఉద్యమం** అనే అంశం ద్వారా విపులీకరించి బోధించారు. సర్వీసు రూల్సు విషయంలో ఏర్పడిన ప్రతిష్టంభన అడ్డంకులను తొలగించడానికి యు.టి.యఫ్. చేస్తున్న కృషిని ఆయన వివరించారు. అనంతరం కార్యకర్తలకు వృత్తి పరమైన సమస్యల సమగ్ర అవగాహన కొరకు **సర్వీసు విషయాల** పై వర్క్‌షాప్ నిర్వహించారు. రాష్ట్ర అకడమిక్ సెల్ కన్వీనర్ కె.వెంకట్రావు **సర్వీసు రూల్సు, ఫండమెంటల్ రూల్సు**ను సోదాహరణంగా బోధించడంతో పాటు కార్యకర్తలు వెలిబుచ్చిన అనేక సందేహాలకు సమాధానాలిచ్చారు.

కార్యకర్తలకు ప్రతి సర్వీసు విషయంపై లోతైన అవగాహనను కల్గించుటకు గాను ప్రతినిధులను మూడు గ్రూపులుగా విభజించి, **పెన్షన్ కాలుక్యులేషన్స్**ను యుటియఫ్.సీనియర్ కార్యకర్త బి.నాగేశ్వరరావు; GIS-FBF ను జిల్లా ప్రధానకార్యదర్శి చావా రవి; GPF ను జిల్లా సహాధ్యక్షులు జి.రాజశేఖర్, **మెడికల్ రీయింబర్స్‌మెంట్**ను జిల్లా ఆడిట్ కమిటీ సభ్యులు టి.శేషయ్య , **సర్వీసు బుక్ నిర్వహణ**ను జిల్లా కార్యదర్శి యం.నరసింహారావు బోధించారు.

మూడవ రోజు మొదటి సెషన్‌లో చావా రవి **సెలవు నిబంధనల** ను; యు.టి.యఫ్. సీనియర్ నాయకులు-యస్.టి.యఫ్.ఐ జాతీయ అధ్యక్షులు శ్రీ డి.రామిరెడ్డి **ఉద్యమ నిర్మాణం, కమిటీలు, నాయకుల పని విధానం** అంశాన్ని సోదాహరణంగా స్ఫూర్తిదాయకంగా బోధించారు.

ముగింపు సమావేశంలో ప్రతినిధులు తమతమ అభిప్రాయాలను వ్యక్తం చేస్తూ శిక్షణా తరగతులలో బోధించిన అంశాలు ఉద్యమ నిర్మాణానికి ఎంతో దోహదం చేస్తాయని, అనేక విషయాలపై సమగ్రమైన అవగాహన కలగడానికి ఉద్యమ తరగతులు తోడ్పడ్డాయని అన్నారు. ఉద్యమ తరగతులకు చక్కటి ఆతిథ్యమిచ్చి, తరగతుల విజయవంతానికి కృషి చేసిన ముదిగొండ మండల కమిటీకి ప్రతినిధులందరూ కృతజ్ఞతలు తెలియజేశారు. యు.టి.యఫ్. జిల్లా కార్యదర్శి యన్. వీరబాబు నేతృత్వంలో ముదిగొండ మండల కార్యకర్తలు భాస్కర్ రెడ్డి, రాధాకృష్ణ, కృపానాదం, కృష్ణాకర్, యమున, కృష్ణా రెడ్డి, సునంద, రేణుక, మురళీధర్, ఉద్దండు సాహెబ్, రమేష్, సత్యనారాయణ, వెంకటరెడ్డి, తదితరులు ఏర్పాట్లను పర్యవేక్షించారు. ఈ కార్యక్రమంలో యు.టి.యఫ్. జిల్లా నాయకులు గోపాలకృష్ణ, కళ్యాణం నాగేశ్వరరావు, దస్తగిరి, భాస్కరరావు ప్రభృతులు పాల్గొన్నారు.

### కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులు ఐక్యంగా పోరాడాలి

కేంద్ర, రాష్ట్ర ఉపాధ్యాయ, ఉపాధ్యాయేతర సంఘాలు అన్ని కలిసి 2-6-2004 నాడు అకౌటెంట్ జనరల్ (ఎ.జి.) ఆఫీసులో "గెట్ టూ గెదర్" ఏర్పాటు చేయడం జరిగింది. జె.ఎ.సి. చైర్మన్ శ్రీయుతులు సుబ్బారావు, టి.ఎన్.జి.ఓ. నాయకులు సుధాకర్, క్రిష్ణారెడ్డి గారలు, యుటియఫ్ నుండి ఎన్. నారాయణ, కృష్ణమూర్తి, డి.టి.ఎఫ్. గంగధర్, ఎ.ఎల్.టి.ఎ. శ్రీధర్ రెడ్డి, పబ్లిక్ సెక్టర్, జనార్ధన్ రెడ్డి, బ్యాంకు నాగేశ్వర రావు, పోస్టలు; ఎ.జి.

తదితర ఉద్యోగ సంఘాల నాయకులు పాల్గొన్నారు. కో-ఆర్డినేటరుగా నాగేశ్వర రావు వ్యవహరించారు.

24.2.2004 నాడు "సమ్మెహక్కు" కోసం సమ్మె చేయడం చారిత్రత్మాకమైనదని, ఈ సమ్మెలో ఎవరికివారు పాల్గొనడం కాకుండా కేంద్ర నాయకత్వం ఇచ్చిన పిలుపుకు స్పందించి సెక్రెటేరియేట్ ఉద్యోగులు, కేంద్ర ప్రభుత్వ ఉద్యోగులు, రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులు, ఉపాధ్యాయులు స్పందించి సమ్మెను జయప్రదం చేయడం పరిశీలిస్తే కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు అనుసరించే సరళీకృత, ఆర్థిక విధానాలు తమపై ఎంత ప్రభావాన్ని చూపుతన్నామో అర్ధమవుతున్నదని ఈ "గెట్ టు గెదర్" కార్యక్రమాలు యింకా అనేక నిర్వహించాలని, కష్టకాలంలోనే కాకుండా వచ్చే ఇబ్బందులను, ఎదుర్కొవడానికి, సమస్యల సాధనకు, రాజకీయ పోరాటం చేయడానికి మనం కల్సిపని చేయాల్సిన అవసరం ఉందని నాయకులు తెలిపారు.

సరళీకృత ఆర్థిక విధానాలు అనుసరించే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలను తుదముట్టించడానికి ఉద్యోగ సంఘాలు ఎవరికి వారే "చాపక్రింది నీరు లాగా" పనిచేశారని. 'పెన్షనర్సు', మరికొందరు బాహాటంగానే పిలుపునిచ్చి ఎన్నికలలో పని చేశారని దీనికి ప్రజల కోపోద్రిక్తతలు తోడయ్యాయని అందుకే "చంద్రబాబు పెన్షనర్లకు డి.ఎ. ఇయ్యమని అడిగి అదే విధంగా ప్రతిపక్షంలోనైనా కూర్చుంటాను కాని ఇవ్వలేనన్నారు." తథాస్తు దేవ తల్లాగా ప్రజలు, ఉద్యోగులు దీవించారు.

అందుకే చంద్రబాబు ప్రతిపక్షంలో కుర్చున్నారెమోనని అంటే మరొకరు "ఉద్యోగుల గుండెలకు తగిలిన గాయాలే" అంతులేనివని ఆ బాధలే ఉద్యోగుల తెగింపుకు కారణమైందని కేంద్రలో వచ్చిన ప్రభుత్వం వామపక్షాలపై ఆధారపడిన ప్రభుత్వం కాబట్టి కార్మిక, ఉద్యోగ వర్గాలకు అనుకూలంగా పనిచేసే అవకాశం ఉంది. కాబట్టి 'సమ్మెహక్కు' సాధించుకోవాలని ప్రతిపక్షాల కుట్రలకు లోనుకాకుండా ప్రభుత్వాన్ని నిలబెట్టుకోవాలని కేంద్ర ప్రభుత్వోద్యోగుల నాయకులు కాంగ్రెసుకు హితవు చెప్పారు.

ఎ.జి. ఆఫీసు ఉద్యోగుల నాయకులు చొరవ తీసుకొని నిర్వహించిన "గెట్ టు గెదర్" కార్యక్రమానికి అభినందనలు తెలియజేస్తూ ప్రతినెలా లేదా రెండు నెలలకు ఒకసారైనా పరిస్థితులను సమీక్షించుకొని ముందుకు సాగాలని నిర్ణయించారు.

**పీలేరు మండల ఇన్‌చార్జ్ ఎం.ఇ.ఓ.ను రిలీవ్ చేయాలని ధర్నా**

ఖాళీగా ఉన్న పీలేరు మండల విద్యాశాఖాధికారి పోస్టునకు రెండు మండలాలకు పక్కనవున్న చిన్నగొట్టి గల్లు మండల విద్యాశాఖాధికారిని ఎఫ్.ఎ.సి.గా చిత్తూరు జిల్లా విద్యాశాఖాధికారిగారు నియమించారు. ఈ నియమాపకము నిబంధనలను అతిక్రమించి నియమించినట్లుగా జిల్లా శాఖ డి.ఇ.ఓ. గారికి అభ్యంతరము తెలుపుతు ప్రాతినిధ్యము చేసినది. సదరు చిన్న గొట్టిగల్లు ఎం.ఇ.ఓ.గారు పీలేరు మండలములో యుటియఫ్ ఉపాధ్యాయుల పట్ల పక్షపాత ధోరణితో వ్యవహరించేవారు డి.ఇ.ఓ.గారు స్థానిక ప్రభుత్వ ఉన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయులకు ఇన్‌చార్జి ఎం.ఇ.ఓ.గా పీలేరుకు నియమించారు. దాదాపు 10 రోజుల వరకు ఎం.పి.డి.ఓ.గారు రాజకీయ ఒత్తిళ్ళకు తలొగ్గి ప్రధానోపాధ్యాయులను చేర్చుకోలేదు. చిన్న గొట్టి గల్లు ఎం.ఇ.ఓ. కార్యాలయము ఎదుట 100 మంది ఉపాధ్యాయులు ధర్నాలో పాల్గొన్నారు. ఈ ధర్నా కార్యక్రమమును రాష్ట్ర కార్యదర్శి ఎన్. సోమచంద్రారెడ్డి ప్రారంభించారు. ఎం.ఇ.ఓ. గారు ఉపాధ్యాయుల పట్ల చూపుతున్న పక్షపాతధోరణిని నిరంకుశత్వాన్ని జిల్లా ప్రధానకార్యదర్శి వై. శ్రీనివాసులు రెడ్డి దుయ్యబట్టారు. కంటెన్‌జెన్సీ నిధులను సక్రమంగా వినియోగపరచలేదని విమర్శించారు. ఆరోజే పక్క మండలమైన రొంపిచర్ల ఎం.ఇ.ఓ. గారికి పీలేరు ఎం.ఇ.ఓ. ఇన్‌చార్జి బాధ్యతలు డి.ఇ.ఓ. గారు అప్పచెప్పారు. ధర్నాలో యుటియఫ్ గౌరవాధ్యక్షులు శ్రీ కె. రామచంద్రారెడ్డి, అధ్యక్షులు శ్రీ జి. శ్రీరామ మూర్తి, అసోసియేట్, అధ్యక్షులు శ్రీ కె. రమణయ్య, కోశాధికారి శ్రీ పి. మోహన మూర్తి ప్రసంగించారు

**చిత్తూరు జిల్లా**

**పీలేరులో ఏ.వి.యస్. వర్ధంతి**

తేది. 27.3.2004 పీలేరులో ప్రభుత్వ ఉన్నత పాఠశాలలో ఏ.వి.యస్. గారి వర్ధంతి సభ జరిగింది. దాదాపు 100 మంది ఉపాధ్యాయులు 8 మండలాల నుండి హాజరైనారు. ఈ సభలో జిల్లా యు.టి.యఫ్. ప్రధానకార్యదర్శి వై.శ్రీనివాసులురెడ్డి ప్రసంగిస్తూ మన దేశములోని ఉపాధ్యాయ ఉద్యమములలో యు.టి.యఫ్.ది విశిష్టమైనశైలి. అటువంటి గొప్ప



ఉద్యమమును ఉపాధ్యాయ జాతికి అందచేసిన ఘనత స్వర్గీయ అప్పారి వెంకటస్వామి గారిది అన్నారు. ఈ సందర్భంగా ఉపాధ్యాయులు సామాజిక సేవాకార్యక్రమాలు చేపట్టాలని, చేయూతనివ్వాలని అన్నారు. తదనంతరము ఏ.వి.యస్. గారి వర్ధంతిని పురస్కరించుకొని 28.3.2004 న పీలేరు మండల శాఖ అధ్యక్షులు శ్రీ టి. చంద్రశేఖర్ రెడ్డి గారి విరాళముతో స్థానిక ప్రభుత్వ హస్పిటల్‌లో 100 మంది రోగులకు పండ్లు - చిక్కటి పాలు యు.టి.యఫ్. ఆధ్వర్యంలో పంపిణీ చేశారు. ఈ కార్యక్రమములో యు.టి.యఫ్. జిల్లా నాయకులు పలువురు పాల్గొన్నారు.

**ఫలితాలతో పాటు ప్రమాణాలకూ ప్రాధాన్యమివ్వాలి**

**- వి.యల్.వర్ధంతి సభలో వక్తల డిమాండ్**

ఇటీవల విద్యారంగంలో వస్తున్న ఫలితాలు అనూహ్యంగాను, విద్యావేత్తలు సైతం ఆశ్చర్యపడేట్లు, సందేహించేట్లు ఉన్నాయని, ఫలితాలను చూసి మురిసిపోవటంతో పాటు విద్యారంగంలో ప్రమాణాల పెంపుదలకు కూడ ప్రభుత్వం, విద్యాశాఖ ప్రాధాన్యత నివ్వాలని జనవిజ్ఞాన వేదిక (జె.వి.వి.) రాష్ట్ర ప్రధానకార్యదర్శి, 'చదువు' మాసపత్రిక ప్రధానసంపాదకులు వి.బాలసుబ్రహ్మణ్యం కోరారు. మే 17న ఖమ్మంలో జరిగిన యు.టి.యఫ్. జిల్లా సీనియర్ నాయకులు కా॥ వి.యల్.నరసింహారావు ద్వితీయ వర్ధంతి సభలో **విద్యారంగంలో ఫలితాలు-ప్రమాణాలు** అనే అంశంపై స్మారకోపన్యాసం చేస్తూ యస్.యస్.సి. ఫలితాల పెంపుదలకు విద్యాశాఖాధికారులు చూపుతున్న ఆతృత, ప్రమాణాల పెంపుదలకు, పాఠశాలల్లో మౌలిక సదుపాయాలకల్పనకు చూపాలని ఆయన అన్నారు. ప్రాథమిక పాఠశాలల్లోని ఉపాధ్యాయులును తగ్గించి, వారిని ఉన్నత పాఠశాలలకు డెప్యుటేషన్‌పై పంపడం ద్వారా విద్యా ప్రమాణాలు కుప్పకూలే ప్రమాదం ఉందని ఆయన హెచ్చరించారు. నిజమైన ఫలితాలతో పాటు, ప్రమాణాలు పెరగాలంటే ప్రాథమిక స్థాయిలో విద్యార్థి, ఉపాధ్యాయ నిష్పత్తిని తగ్గించి,అవసరమైనంత మంది ఉపాధ్యాయులను నియమించటంతో పాటు, మాతృభాషలో బోధనను ఖచ్చితంగా అమలు జరపాలని అన్నారు.

సభకు అధ్యక్షతన వహించిన యు.టి.యఫ్. జిల్లా గౌరవాధ్యక్షులు కె.శ్రీనివాసులు మాట్లాడుతూ కా॥ వి.యల్. నరసింహారావు ఉపాధ్యాయుల సంక్షేమం కోసమే కాకుండా, విద్యార్థుల్లో అక్షరాస్యతను, ప్రమాణాల పెంపును

కోరుకొని, దాని కోసం కృషి చేశారని, జీవిత చరమాంకం వరకు ప్రజా ఉద్యమాలలో పనిచేశారని, వారి స్ఫూర్తితో ఉద్యమాలలో పనిచేయాలని నివాళులర్పించారు. సదస్సులో యు.టి.యఫ్. రాష్ట్ర కార్యదర్శి సయ్యద్ జియావుద్దీన్, జిల్లా అధ్యక్షులు బి.నరసింహారావు, జనవిజ్ఞానవేదిక నాయకులు మల్లెంపాటి వీరభద్రరావు, యు.టి.యఫ్. సీనియర్ నాయకులు ఆర్.పురుషోత్తమరావు, యస్.గోపాలరావు, పారుపల్లి సత్యనారాయణ, డి.రామచంద్రయ్యలతో పాటు యు.టి.యఫ్. జిల్లా సహాధ్యక్షులు జి.రాజశేఖర్, ప్రధానకార్యదర్శి చావా రవి, నాగమల్లేశ్వరరావు, చిట్టెమ్మ, చలం, వీరబాబు, నరసింహారావు తదితరులు పాల్గొన్నారు.

**పీలేరు మండల ఇన్‌చార్జ్ ఎం.ఇ.ఓ.ను రిలీవ్ చేయాలని ధర్నా**

ఖాళీగా ఉన్న పీలేరు మండల విద్యాశాఖాధికారి పోస్టునకు రెండు మండలాలకు పక్కనవున్న చిన్నగొట్టి గల్లు మండల విద్యాశాఖాధికారిని ఎఫ్.ఎ.సి.గా చిత్తూరు జిల్లా విద్యాశాఖాధికారిగారు నియమించారు. ఈ నియమాపకము నిబంధనలను అతిక్రమించి నియమించినట్లుగా జిల్లా శాఖ డి.ఇ.ఓ. గారికి అభ్యంతరము తెలుపుతు ప్రాతినిధ్యము చేసినది. సదరు చిన్న గొట్టిగల్లు ఎం.ఇ.ఓ.గారు పీలేరు మండలములో యుటియఫ్ ఉపాధ్యాయుల పట్ల పక్షపాత ధోరణితో వ్యవహరించేవారు డి.ఇ.ఓ.గారు స్థానిక ప్రభుత్వ ఉన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయులకు ఇన్‌చార్జి ఎం.ఇ.ఓ.గా పీలేరుకు నియమించారు. దాదాపు 10 రోజుల వరకు ఎం.పి.డి.ఓ.గారు రాజకీయ ఒత్తిళ్ళకు తలోగ్గి ప్రధానోపాధ్యాయులను చేర్చుకోలేదు. చిన్న గొట్టి గల్లు ఎం.ఇ.ఓ. కార్యాలయము ఎదుట 100 మంది ఉపాధ్యాయులు ధర్నాలో పాల్గొన్నారు. ఈ ధర్నా కార్యక్రమమును రాష్ట్ర కార్యదర్శి ఎన్. సోమచంద్రారెడ్డి ప్రారభించారు. ఎం.ఇ.ఓ. గారు ఉపాధ్యాయుల పట్ల చూపుతున్న పక్షపాతధోరణిని నిరంకుశత్వాన్ని జిల్లా ప్రధానకార్యదర్శి వై. శ్రీనివాసులు రెడ్డి దుయ్యబట్టారు. కంటెన్‌జెన్సీ నిధులను సక్రమంగా వినియోగపరచలేదని విమర్శించారు. ఆరోజే పక్క మండలమైన రొంపిచర్ల ఎం.ఇ.ఓ. గారికి పీలేరు ఎం.ఇ.ఓ. ఇన్‌చార్జి బాధ్యతలు డి.ఇ.ఓ. గారు అప్పచెప్పారు. ధర్నాలో యుటియఫ్ గౌరవాధ్యక్షులు శ్రీ కె. రామచంద్రారెడ్డి, అధ్యక్షులు శ్రీ జి. శ్రీరామ మూర్తి, అసోసియేట్, అధ్యక్షులు శ్రీ కె. రమణయ్య, కోశాధికారి శ్రీ పి. మోహన మూర్తి ప్రసంగించారు.

**బల్లికురవ యు.టి.యఫ్. మండల శాఖ ఆధ్వర్యంలో**
**ఉచిత కంటి వైద్య శిబిరం**

యు.టి.యఫ్. ప్రకాశం జిల్లా బల్లికురవ మండలశాఖ 1-2-2004న వైదన గ్రామములో ఉచిత కంటి వైద్య శిబిరాన్ని నిర్వహించింది. ఈ శిబిరాన్ని మండల అధ్యక్షులు పోగుల సుబ్బారావు గారు ప్రారంభించారు. శిబిరానికి



300 మంది రోగులు వచ్చి కంటిపరీక్షలు చేయించుకొన్నారు. ప్రముఖ నేత్ర వైద్యులు శ్రీ కుందుర్తి శివదుర్గా ప్రసాదరావు ఉచితంగా వైద్య పరీక్షలు చేశారు

ఈ కార్యక్రమానికి ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ రాష్ట్ర కార్యదర్శి శ్రీ జి. శేషయ్య ముఖ్యఅతిథిగా హాజరయ్యారు. యు.టి.యఫ్. రాష్ట్ర కౌన్సిలర్ శ్రీ యస్. వెంకట సుబ్బయ్య, మండల అధ్యక్షులు డి. శేషగిరి, ప్రధాన కార్యదర్శి సిహెచ్. శ్రీనివాసరెడ్డి, ఉపాధ్యాయులు బండి నాగేశ్వరరావు, యల్. చంద్రశేఖర్, డి.సుబ్బారావు, కె.కె. బహుదూర్, ఏ. సుబ్బారావు తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొని శిబిరము జయప్రదం కావడానికి తోడ్పడ్డారు.

## గుంటూరు జిల్లా

**యుటియఫ్ కార్యాలయంలో 'మేడే' వేడుకలు**

ప్రపంచ కార్మిక దినోత్సవం సందర్భంగా మేడే నాడు గుంటూరు జిల్లా యుటియఫ్ కార్యాలయంలో యుటియఫ్ సీనియర్ నాయకులు వి. విశ్వనాధం సంఘ పతాకాన్ని ఎగురవేశారు.

అనంతరం జరిగిన సమావేశంలో యుటియఫ్ జిల్లా ప్రధానకార్యదర్శి కె.ఎస్.వి. దుర్గా రావు అధ్యక్షత వహించగా శ్రీ వి.విశ్వనాధం ప్రసంగిస్తూ ప్రపంచ వ్యాప్తంగా 130 కోట్ల మంది దారిద్ర్యంలో జీవిస్తున్నారని, మంచినీరు, పారిశుధ్యం, గృహవసతి లేని ప్రజలు 120 కోట్ల మంది వున్నారని, మూడవ ప్రపంచదేశాల రుణభారం వాటి జాతీయాదాయంలో 44%కు చేరిందనీ సామాజిక సమస్యల పరిష్కారానికి సోషలిజమే శరణ్యం అంటూ అందుకు అందరు కృషి చేయాలన్నారు.

**సెయింట్ జేవియర్ హైస్కూలు, ఏలూరు**
**ప్రధానోపాధ్యాయులు శ్రీవేలేటి సుబ్రహ్మణ్యం.**
**పదవీవిరమణ చేయుచున్న సందర్భంగా -**

## శుభాకాంక్షలు



శ్రీవేలేటి సుబ్రహ్మణ్యం సెయింట్ జేవియర్ ఉన్నత పాఠశాలలో జులై 1, 1970 న బి.యిడి. అసిస్టెంట్‌గా నియమితు లైనారు. అప్పటి నుండి పదవీ విరమణ చేయువరకు పాఠశాలలో గణితమును బోధించుచున్నారు. యస్.సి. ఇ.ఆర్.టి. హైదరాబాదులో రిసోర్సు పర్సన్‌గా, తాడేపల్లి గూడెం, నిడదవోలు, తణుకు, ఏలూరు లలో అనేక ఓరియం టేషన్ క్లాసులకు రిసోర్సు పర్సన్‌గా పనిచేశారు. వీరు జిల్లా, ప్రాంతీయ, రాష్ట్ర మరియు జాతీయ స్థాయిలలో నిర్వహించబడిన అనేక విద్యా వైజ్ఞానిక ప్రదర్శనలలో పాల్గొని Mathematical Innovative Teaching Aids ను తయారు చేసి అనేక సార్లు బహుమతులు గెల్చుకొన్నారు. 1977సం॥ లో National Children Science fair లో Joys of Toys అంశము క్రింద ప్రదర్శించిన Innovative Aid కు జాతీయ స్థాయి బహుమతి పొందినారు. 1998 జనవరిలో కొల్లం (కేరళ)లో జరిగిన ప్రాంతీయ విద్యావైజ్ఞానిక ప్రదర్శనలో ఉత్తమ ఉపాధ్యాయ బహుమతిని పొందడంతో పాటు Sir C.V.Raman గారి Non-Rolling Trophy ని పొంది St.Xavier High School కు వన్నె తెచ్చారు. అనేక విద్యావైజ్ఞానిక, విహారయాత్రలను మా పాఠశాలలోనే గాక ఇతర పాఠశాలలో కూడ నిర్వహించి విద్యార్థినీ విద్యార్థులలో విజ్ఞాన వికాసాలను కలిగించిన మా సుబ్రహ్మణ్యం గారు 2004 సం॥ జూన్ 30న పదవీ విరమణ చేయు సందర్భంగా మా హృదయ పూర్వక శుభాకాంక్షలు తెలియజేయుచున్నాము.

*

